# కవిగారి స్వగతాలు

(కవితా సంకలనం)




'కవిగారు'

ఆకునూరు గోపాలకిషన్‌రావు



# 'కవిగారి స్వగతాలు'

(కవితా సంకలనం)

కవిత్వీకరణ :

'కవిగారు'

(ఆకునూరు గోపాల కిషన్ రావు)

ప్రథమ ముద్రణ :
శ్రీధాత దీపావళి
నవంబరు ౧౯౯౬ NOV 1996

ప్రచురణ :
**ప్రేమాలయ కమ్యూనికేషన్స్**
12-2-419/ఎ/25, ఆలపాటి నగర్,
మెహిదిపట్నం, హైదరాబాద్ - 28.

ప్రతులకు :
'కవిగారు'
'అమ్మకృప' 97 వాసవీకాలనీ 'A'
సికింద్రాబాద్ - 500 015
**Ph 27747882**

మరియు ప్రముఖ బుక్‌స్టాల్స్ . . .

డి.టి.పి. :
**సౌందర్య ఎంటర్ ప్రైజెస్,**
నారాయణగూడ, హైదరాబాద్

ప్రింటింగ్ అండ్ ప్రాసెసింగ్ :
**శ్రీ సాయి రత్న ప్రాసెస్**
3-6-780/22, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029.
ఫోన్ : 7607900

**వెల : రూ. 50/-**

# అట్టమీది ఆప్తులు

1. నాన్నమ్మ
2. తాతయ్య – అమ్మమ్మ
3. పెద్ద మామయ్య
4. శ్రీమతి గారి అమ్మమ్మ
5. అత్తగారు
6. 18 యేట చనిపోయిన రెండో తమ్ముని కూతురు
7. పెద్ద చెల్లెలు అత్తగారు
8. పెద్ద చెల్లెలు
9. ,, ,, కొడుకు
10. ,, ,, ,, ,, పెద్ద కూతురు
11. ,, ,, ,, ,, ,, పెద్ద కొడుకు
12. ,, ,, ,, ,, ,, చిన్న కొడుకు
13. బాపు – అమ్మ
14. నేనూ – శ్రీమతి
15. అల్లుడు – కూతురు
16. కొడుకు – మనమడు – కోడలు
17. కోడలు తల్లి
18. రెండవ చెల్లెలు అత్త
19. బావ – రెండవ చెల్లెలు
20. మామగారు
21. పెద్ద తమ్ముడు – మరదలు
22. రెండవ తమ్ముడు – మరదలు
23. బావ – కోడలు – ఐదవ చెల్లెలు
24. బావ – మూడవ చెల్లెలు
25. బావ – నాల్గవ చెల్లెలు
26. అన్నయ్య (చిన్న మామయ్య) – అత్తయ్య
27. చిన్న తమ్ముడు

# అనుక్రమణిక



*****

# పంచ శీలములు

నల్గురినీ
నవ్వించుట
నా జీవిత
పరమ ధ్యేయం !

నల్గురికీ
సాయ పడుట
నా చేతల
నర్మ భావం !

నల్గురకూ
హృది పంచుట
నా కవితల
నడత విధానం !

నల్గురునూ
ఎదగ చూచుట
నా కన్నుల
ఎద ఆరాటం !

నల్గురికై
కరిగి పోవుట
నాకు సదా
మహదానందం !



# భావ గాంభీర్యాలు

తను కాలు కదపకనే సకల బలుడు
ధరణి నంతటిని నడిపిస్తాడు
ఎంత శక్తి వంతుడైతే తప్ప
ఇంతటి కార్యం సాధించగలడు

పంచ భూతాత్మల సఫల
సాక్షాత్కారమే జననము
వాటన్నిటి యొక్క విఫల
వినిర్గతమే మరణము
రెంటి నడుమ కాలంలో ఇతరులకై కూడా
ఆదర్శంగా బ్రతికిందే భవ్య జీవితం !

ఆలోచన రావడమే తరువాయి
ఆవేశంగా స్పందించును మెదడు
మదిలో మనోజ్ఞ భావాలల్లుక పోయి
మరుక్షణం మార్దవంగా వ్రాయబడు !

అర్వై ఏళ్లు దాటక ముందే
అన్ని పనులు ముగించుకొని
ఆ పరమాత్ముని కరుణ యందే
ఆశ నిలిపి యున్న వాడిని !



# శ్రీ గణేశ్

ఒకశక్తి సృష్టి నడకను
నికరముగా నిర్వహించు నీమము తోడన్
'సకలబల' గ ఆశక్తికి
సకలురము వంచవలె తల సాకల్యముగా !

# స్వగతాలు

నా వారి మురిపాలు
చదువరుల సరదాలు
ఎల్లరి హృదయాలు
దోచు నీ రచనలు
కమనీయ కవనాలు
కవిగారి స్వగతాలు

# కవన నిర్నిబంధన

ఏ నియమ నిబంధన
లే యతి ప్రాస బంధన
లేవియు లేనందున
లావగు స్వేచ్ఛాకవన
లాస్యంబు లివియన
నా ధీశక్తికి పెట్టి సాన
వీక్షించెద వెలుగులీన
శ్రీవాణీ కరుణ వలన !



# ఆవాహనాంజలి

విఘ్నములు దొలగ జేసెడు
విఘ్నేశ్వరు మదిదలచి కవిత్వము వ్రాతున్
విఘ్నము లేకుండా ని
ర్విఘ్నముగా సాగజూడు వినాయక ప్రభూ !

శ్రీ తిరుమల వేంకటపతి
ఆ తిరుపతి పద్మావతి ఆశీస్సులతో
నేతల పెట్టితి వ్రాయగ
వ్రాతలకిక అడ్డదేల రాధమ్మ సుతా !

ప్రణమిల్లెద మొట్టమొదట
వాణీమతల్లి దేవత వాగీశ్వరికిన్
గణనీయమైన కైతలు
గుణ గణముల వర్ధిలనట్లు గూరుచు తల్లీ !

సంపదల తల్లి లక్ష్మిని
ఇంపుగ కొనియాడి నేను ఈప్సిత మడుగన్
సంపదలు కొల్లలుగయిక
పంపుగదా తాను మనకు స్వర్ణలతా శ్రీ !

ఆంధ్రు లెందఱు దేవతలంత మంది
అందురు కదా మరినేనందు వలన
అందరికి మోకరిల్లెదనాసతోడ
కరుణ మ్రోగించ నాదగు కవిత ఘోష !

సరస్వతీ నమస్తుభ్యం



# కృతజ్ఞతలు

నేను కవితలు వ్రాయడం మొదలు పెట్టిన నాటినుండి వాటిని చదువుతూ, అడుగుగునా సహకరిస్తూ, ప్రోత్సహిస్తూ, చక్కని 'తొలిపలుకు' వ్రాసిన నా శ్రీమతి 'విద్యారత్న' డాక్టర్ శ్రీమతి స్వర్ణలతకు, నా మొదటి పాఠకవిమర్శకులుగా ఎంతో సహాయపడిన నా కూతురూ - అల్లుడూ డా॥ స్వప్న - క్రిష్ణలకు, కొడుకూ - కోడలూ డా॥ గౌతం - శైలా కుమారి కి, నా వ్రాతల కెట్టి ఆటకం కలిగించ కుండ నా జీవితానికో సార్థకత కలిగిస్తున్న నా బుజ్జి మనుమడు చి॥ అమోఘ (నన్ను 'కవిగారు' అని పలిచిన నా పెద్ద మామయ్య) కు,

'అనుబంధపు ఆలాపనలు' ను ఆప్యాయతతో వ్రాసి పెట్టిన ప్రియమిత్రులు శర్మాజీగారికి, 'అన్నయ్య ఆశీస్సులు' వ్రాసి యిచ్చిన అన్నయ్య (చిన్న మేనమామ) శ్రీ సుదర్శన్‌రావుగారికి, అన్నయ్యకాని అన్నయ్యలా నా రచనా వ్యాసంగంలో గొప్ప సహాయకులుగా నిలుస్తూ నాకెంతో ఆత్మ విశ్వాసాన్నందిస్తున్న శ్రీ పాణుగుపాటి కృష్ణమూర్తి (సెక్రెటరీ, శ్రీ సూర్య మిత్ర ధార్మిక నిధి) గారికి, కవర్ పేజీలు సర్వాంగ సుందరంగా కంప్యూటర్ డిజైన్ చేసి యిచ్చిన డా॥ నీరజ్ మల్టీమీడియా స్టూడియోస్ వారికి, రచనా వ్యాసంగంలో శైశవావస్థలోనున్న నా పడిలేస్తున్న బుడి బుడి నడకల స్వగతాలలోని అపశృతులను గొప్ప మనస్సుతో సవరించి, అవ్యాజమైన ప్రేమతో కమనీయంగా 'స్వేఛ్ఛా భావుకుడు కవిగారు' పరిచయ వాక్యాలు సిద్ధించి యిచ్చిన మిత్రులు డా॥ ఎల్లూరి శివారెడ్డి గారు, ఉస్మానియా విశ్వవిద్యాలయ ఆంధ్ర శాఖాధ్యక్షులకు, పెద్దన్న గారి అప్యాయతతో అడగగానే 'సాహిత్యంలో క్రొత్త వెలుగులు' వ్రాసి నాకు వెలుగు చూపించిన కళాప్రపూర్ణ డా॥ పోతుకూచి సాంబశివ రావు గారికి,

కమనీయంగా కంపోజ్ చేసి యిచ్చిన సౌందర్య ఎంటర్ ప్రైజెస్, నారాయణగూడ, శ్రీ ఆర్. ఎస్. శర్మగారికి, శ్రీ శివప్రసాద్‌గారికి, శ్రీ మాన్‌సింగ్, కుమారి. మరీచికకు, ప్రూఫ్ రీడింగ్ చేసిన కుమారి సుషమ, లలితకు,

ముద్దుగా ముద్రణ చేసి యిచ్చిన శ్రీ సాయి రత్నప్రాసెస్ బి. ఎల్లారెడ్డిగారికి అవ్యాజానురాగాలతో నా ఆలోచనల కనుగుణంగా సంకలనాన్ని తీర్చిదిద్దిన శ్రీ శర్మాజీ (ప్రేమాలయ కమ్యూనికేషన్ ) గారికి,

. . . నా హృదయపూర్వక కృతజ్ఞతలు.

- కవిగారు

# తొలి పలుకు

చతుష్షష్టి కళలలో కవిత్వమొకటి. మన భావపరంపరలను, హాసక్రోధానురాగములను, చక్కని భాషలో సరళంగా, మధురంగా వ్యక్తపరచడానికి కవిత్వమొక సాధనము. కవితల్లటం, కొందరికి కాలక్షేపమయితే, కొందరికి వరం. ఈ కవితా సంపుటి ''కవిగారి స్వగతాలు'' వ్రాసిన శ్రీవారికి మాత్రం బాల్యంలో వారి పెద్ద మామగారు పలికిన భవిష్యవాణి తనను ''కవిగారూ'' అని బాల్యంలో పిలవటం వలన ఆయన వరంగా తాను రిటైరయినాక యీ కవితా పరంపరలు చేస్తున్నానంటుంటారు. ఈ సంపుటి రచయిత ''కవిగారు'' (పెద్ద మామయ్య వాక్కునే తన ''కలంపేరు'' గా పెట్టుకున్నారు) నేను దంపతులం. ముప్పైమూడేళ్లుగా వీరి సహచర్యంలో జీవితపు ఆటుపోటులను అనుభవించాను. కష్టం-సుఖం, మంచి-చెడు, కలిమి-లేములు పంచుకొన్నాను. ఎటువంటి క్లిష్ట పరిస్థితి వచ్చినా వెన్నంటి వున్నాను. జీవితంలో చేదునిజాలను తెలుసుకొనడానికి వీరి సహచర్యం ఎంతో తోడ్పడింది. ఎన్నో పాఠాలను నేర్పి విజ్ఞానవంతురాల్ని చేసింది.

యదార్థ వాదం వారి మతం. తాను అనుకున్నది చేయటం, సాధించటం వారి అలవాటు. దేనికీ వెనుకంజ వేయరు. విద్యుచ్ఛక్తి బోర్డులో తన కర్తవ్య నిర్వహణ ఋజుమార్గంలో చేసి యిటీవలే పదవీ విరమణ చేశారు.

హఠాత్తుగా ఒకరోజు డా॥ సినారె గారి ''మౌనరణం'' గజలును ఆంగ్లం, ఉరుదూలలోనికి అనువాదం చేసి వారి మన్ననలను పొందారు. ఆనాడు సాగిన కలం ఈ నాటి వరకు ఆగలేదు. ''కవిగారు'' తెలుగు, ఆంగ్లము ఉర్దూ భాషలలో అనర్గళంగా వ్రాయగలదిట్ట. తనవారందరి పై తన అపారప్రేమకు యీ సంపుటిలో అక్షర రూపమిచ్చుకున్నారు.

మొదట 'భవిష్యవాణిగా' 'కవిగారూ' అని తనను చిన్నప్పుడు పిలిచిన పెద్దమామయ్యను కీ॥శే॥ దేవులపల్లి వెంకటేశ్వరరావుగారిని (దేవేరా - కలంపేరు) స్మరించారు. తమకు విద్యాదానం చేసిన అమ్మమ్మ తాతయ్యలను స్తుతించారు. అపారమైన ఆస్తిదాతలు నానమ్మ తాతయ్యలను కీర్తించి, తమ ఆదర్శమైన సుదర్శన్ అన్నయ్యను (చినమేమమామ) శ్లాఘించారు.

తమ వంశ వృక్షం గూర్చి వివరించారు. తమనుకున్న ఉమ్మడి కుటుంబం విడిపోయిందని 'ఒక్కేపుదారి' లో వారి వ్యధను తెలిపారు. నా గురించి 'జ్ఞానపుంజం' లో చెప్పారు. శ్రేయోభిలాషులు పింగళి ద్వయాలను గుర్తు చేసుకొన్నారు. తనకు చదువు చెప్పిన గొప్ప గురువులను తలవటం మరువలేదు. కుమారుడైన చి॥ గౌతం (Workaholic) వాని స్నేహితులు విశ్వేందర్, శ్రీధర్‌లతో కలిసి పనిచేసే తీరును మెచ్చుకున్నారు.

ఈ లోగా వారు 10 అక్టోబర్ 1995 రోజు తాతగారైనారు. మనుమడిపై కవితలల్లి తనను కవిగారూ అన్న తన పెదమామయ్య ఆ కవితలు వినవచ్చాడని తన్మయులయ్యారు.

తన ప్రథమ ఆంగ్ల కవిత కంప్యూటర్ ప్రింటింగ్ చేయించడానికి వారి అల్లుడు, అమ్మాయి ఆఫీసుకు వెళ్లి వారు పనిచేసే తీరుకు మురిసి 'స్థితప్రజ్ఞత' వ్రాశారు.

తదుపరి తన పదవీ విరమణ, వీడ్కోలు సందర్భంగ సుదీర్ఘ కవిత్వంలో తన గతం భవితవ్యగానం చేశారు.

ఇలా ఎన్నో, ఎన్నెన్నో సందర్భాలాలలో సహజంగా స్పందించి కనుల నీరు తెప్పించే కవిత లెన్నో చేశారు. ఇవన్నీ దాదాపు వ్యక్తి గతాలే. వారి ఆశలూ ఆశయాలు యేవిధంగా నెరవేరలేదో వ్యథతో వ్యక్త పరిచారు. ఆశయ సాధనకు కృషి విద్య రెండూ ఎంతో అవసరం.

''విద్యాధనం శ్రేష్ఠధనం
తన్మూలం ఇతర ధనం
దానేన వర్ధతే నిత్యం
న భారాయ న నీయతే''

అట్టి విద్యా ధనాన్ని తమ కందించిన అమ్మమ్మ – తాతయ్యలకు వారిచ్చిన విద్య వలన తాము వ్రాసిన యీ ప్రథమ సంపుటి నంకితం చేసి తమ ధర్మం నిర్వహించారు.

'కవిగారు' తాము తెలుగు, ఆంగ్లము, ఉర్దూలలో వ్రాసిన ఇతర 19 సంపుటాలు కూడా చదువరులకు అందివ్వాలని కోరుకుంటూ నాకీ **'తొలి పలుకు'** వ్రాసే అవకాశాన్నిచ్చినందుకు మహద్భాగ్యంగా భావిస్తున్నాను.

**విజయ దశమి** **''విద్యారత్న'' డా॥ ఆకునూరు స్వర్ణలత**

21-10-96 M.A., M.Ed., Ph.D.

# కవిగారి పలుకు

నన్నేమీ పలుక నీయనంతటి పటిష్ఠంగా తొలి పలుకందించింది శ్రీమతి. అది తనే వ్రాయాలన్న నామనోభీష్టం సరియైనది కదా ?

ఘనాఘనులతో పీఠికలు వ్రాయించుకొనే రోజుల్లో ఓ కవిగారు తను ప్రాణాని కన్నా మిన్నగా ప్రేమించే శ్రీమతి విద్యా సాహిత్య కోవిదురాలు కూడా ఘనమైనదే కదా అనే ధీమాయే యీ పనికామెనర్థించడంలోని ఔచిత్యం. ముప్ఫై మూడు వసంతాలు జీవితంలో కలిసి ప్రయాణించిన తన కన్నా గొప్ప తొలిపలుకు వ్రాయనితరులకు సాధ్యమా? అదియును కాక యిదో క్రొత్త ఒరవడికి నాంది కూడా !

నేనో రచయితనో కవినో ఔతానని కలలో కూడా అనుకోలేదు. కాని **1948-49** ప్రాంతాల్లోనే (నాకపుడు పదకొండు సంవత్సరాల వయసే) తనో మంచి కవియైన మా పెద్ద మామయ్య నన్ను 'కవిగారూ' అని సంబోధించేవాడు. ఆయన వాక్శుద్ధి, భవిష్యవాణి **46** సంవత్సరాల తరువాత నిజమైంది.

కవిత రచనా విషయంలో ఆచార్య శ్రీ. సి. నారాయణ రెడ్డిగారు నాకు పితృతుల్యులు. ఆయన 'మౌనరణం' లో నుండి నేను సాహితీ జన్మనెత్తాను. అది లేకుంటే ఈ కవిగారే లేడు. ఈ కవిత్వాలే లేవు.

మా అబ్బాయి చి॥ గౌతంకు తెలుగు విశ్వవిద్యాలయంలో ఆయన హయాంలో వుద్యోగం లభించింది, వాడికాయన గురుతుల్యుడు. కాక తాళీయంగా నా శ్రీమతి విద్యారత్న డా॥ స్వర్ణలత యం.ఏ., ఎమ్.ఎడ్., పి.హెచ్.డి.కి ఆయన యం.ఏ. లో తెలుగు గురువు. ఉద్యోగం దొరికిన సంవత్సరంలోపే వాడాయనగారి చేతులమీదుగా సత్కారం పొంది భేషనిపించు కున్నాడు.

మా వాడి గురించి ఆయనగారితో ఆశువుగా నేను చెప్పిన రెండు పంక్తులు

''మేము సృజియించిన జీవశక్తి
మీరు వెలిగించిన దివ్వె వృత్తి''
జీవకుడు అనే నా పదాన్ని జీవశక్తి అని రెడ్డి గారు మార్చారు.
మరిప్పుడు నా గురించో రెండు పంక్తులు చెప్పాల్సిన సందర్భమిది.
'మామ యేనాడో వుహించిన కవిగారు' మీ
'మౌనరణం' లో నుండి పుట్టినారు సుమీ !

ఇక వ్రాతలంటారా ! నేనో నిమిత్త మాత్రునిగా సాగుతూనే పోతున్నవి. మూడు భాషలలో సంవత్సరంన్నరలో ఓ ఇరవై కవితా సంపుటాలు వ్రాయడం, యే ఒక రచనా ముద్రించక యిది ప్రథమ సంపుటిగా వెలువడుతుండడం నాకే ఆశ్చర్యంగా వున్నది.

''కాంతిశక్తి'' సేవ ముగిసినాక ''క్రాంతిశక్తి'' సేవ చేయాలన్న నా ఆశయం ఫలించే రోజు త్వరలోనే రానున్నదనిపిస్తున్నది. ఈ కవితలు చూసిన వారందరు ఆనందిస్తారనే వీటిని ముద్రించడం. ఇదో వినూత్నప్రక్రియ. నేనైతే యిలాంటి కవితాసంపుటి నాకు తెలిసిన యే భాషలోను చూడలేదు.

ఇందులో యేవిధమైన ఛందోనిబంధనలు నేను పాటించలేదు. అది చర్చనీయాంశం కాకూడదు. ఇవి నా మనస్సు పాడుతుంటే నా కలం అక్షరీకరించిన భావ వెల్లువలు.

దోషాలన్నిటినీ సాహిత్యంలో పరిణతి లేని ఓ విద్యుదింజనీరు అపశృతులుగా ఎంచి ఇతర యే సూచన, సలహాలైన వుంటే గొప్ప మనసుతో నాకెరింగిస్తే నా కంగీకార, ఆచరణ యోగ్యాలై నా పరిణతికి తోడ్పడగలవు.

కవిగారు

**21-11-96** **ఆకునవూరు గోపాలకిషన్‌రావు**

# స్వేఛ్ఛా భావుకుడు కవిగారు

ఆకునూరు గోపాలకిషన్ రావు గారి 'కవిగారి స్వగతాలు' చదివి ఆనందించాను. హృదయం ఉప్పొంగినప్పుడల్లా వారు తమ కలానికి పని కల్పించారు. ఎన్నో అనుభవాలు, ఎన్నో ఊహలు, ఆయన గుండెలో రొద చేస్తున్నాయి. ఆ సవ్వడులే ఈ రచనలోని గలగలలు. కొన్ని సందర్భాల్లో ఆయన రాసిన పద్యాలు ఇందులో ఉన్నాయి. అయితే వచన కవితలే అధికం. అలంకార పరిష్క్రియ గాని, చమత్కారాల తాళింపులు గాని వారికిష్టం కావు. ఉబికి వచ్చిన భావాన్ని ఉదాత్తంగా చెప్పడం కవిగారికి ఇష్టం. ఉన్నతోద్యోగాల్లో ఉన్నా గౌరవం సంపాదించటం తప్ప అవార్డులు సంపాదించటంలో ఆయన కంత అభిరుచి లేదు. పైగా.

'అవార్డు కృషిత సంపాదిస్తే
అది పొంది నంత గొప్పే కద
రాలేదని బాధ పడితే
అది మరింత తప్పే కద
వచ్చినా ఏముంది చూచితే
మరీ చిన్న కప్పే కద' ! అంటారు ఆహ్లాదకరంగా.

కవిగారు కలం సాగించింది సినారె స్ఫూర్తి వల్ల. ఆ విషయాన్ని పదే పదే పరవశించి చెప్పు కున్నారు. కృతజ్ఞత చూపు కున్నారు. వారి సినారె 'మౌనరణం' ఆంగ్లానువాదం సముచితంగా, సరసంగా ఉంది. సినారె గారు సూచించినట్లు వారు మరెన్నో ఆంగ్ల రచనలు చేయాలి.

వారి ఆత్మీయ వర్గం ఈ పూదోట. అందులో ఒక్కొక్క వ్యక్తి ఒక పూవు. వారి వారి ఆత్మీయతలే ఆ పూల రంగులు. వారి సంస్కారాలే ఆ పూల పరిమళాలు. ఈ పూలను పెంచిన తోట మాలి ఈ కవిగారు. ఈ కవి అంతరంగమే మరొక విధంగా చెప్పాలంటే మధువనం. ఎన్నెన్నో భావాలను స్వఛ్ఛందంగా వెల్లడించిన ఈ కవిగారిని అభినందిస్తున్నాను.

**16-11-96**

ఆచార్య ఎల్లూరి శివారెడ్డి
ఆంధ్ర శాఖాధ్యక్షుడు
ఉస్మానియా విశ్వవిద్యాలయం
హైదరాబాద్.

# సాహిత్యంలో క్రొత్త వెలుగులు

తెలుగు సాహిత్య రంగంలో ఎందరో కవులున్నారు. కాని 'కవిగారు' అని సార్థక నామం గల కవులు లేరు, గోపాలకిషన్ రావు తప్ప.

జీవితంలో చూసిన అనుభవించిన అనేక సంఘటనలకు ఉత్తేజితులై కవులు కవిత చిత్రిస్తారు. ఆ లక్షణంతో పాటు చుట్టూ ఉన్న ఆత్మీయులను ఆత్మీయ భావాలకు కవితలల్లి హృదయములో పొంగి పొరలే సాన్నిహిత్య జీవన తరంగాలు కదిలించడం కవిగారి విశిష్టత.

భార్యా, పిల్లలు, బంధువుల, అన్నదమ్ములు, తాతయ్య - నాన్నమ్మలు, అమ్మమ్మ - తాతయ్యలు వంశంలో కొన్ని కదిలే బొమ్మలు. కాని వాటికి జీవం పోసి, చైతన్యం కలిగించి చరిత్రలో నిలిపిన ఘనత కవిగారిది. ఇది కవితా రంగంలో క్రొత్త ఒరవడి.

డా॥ సినారె తనకు సాహిత్య గురువు సాక్షత్తు తండ్రి వంటి వారని కవిగారు హృదయం విప్పి సీతారామ లక్ష్మణలను చూపిన ఆంజనేయునిలా, సాహిత్య భక్తుడిగా నిలవడం గురు శిష్య సంబంధ బాంధవ్యానికి ఓ క్రొత్త కెరటం. మాటలో మంచితనం, మనస్సులో ఆత్మీయత పొంగుల పరుగులు, స్నేహానికి ఆదరణ రంగరించుకున్న గోపాలకిషన్‌రావు ప్రేమ స్వరూపులు.

ఆంధ్ర, ఆంగ్ల బాషల్లో సమాన పాండిత్యం, కల్పనాశక్తి, శిల్పిలా కవితలు చెక్కగల సామర్థ్యం కిషన్‌రావు లోని ఆదరణీయ గుణాలు.

ఈ గ్రంథం కవితా గ్రంథమే కాదు, ఒక కవితాత్మగల ఆత్మ కథ కూడా. కృత్రిమం లేని సహజ సరళ బాణీలో రూపొందిన వాణి.

ఈ కవిగారి స్వగతాలు తారాజువ్వల్లా హృదయం ఛేదించుకుని సాహిత్య ఆకాశంలోకి చొచ్చుకు వచ్చాయి. ఇవి సాహిత్య రంగంలో క్రొత్త వెలుగులు.

ఆకునూరు గోపాలకిషన్‌రావు ఆకాశమంత ఎత్తు సాహితీ వేత్తగా ఎదగాలని నా హృదయ పూర్వక ఆకాంక్ష !

కళా ప్రపూర్ణ డా॥ పోతుకూచి సాంబశివరావు
6-3-195 న్యూ బోయిగూడ
సికింద్రాబాదు - 3.
ఫోన్ : 823177



ఓం సాయిరాం

# అనుబంధపు ఆలాపనలు

హృదయం ఆనందమయ మైతే ఝరిలా పారుతుంది 'కవిత్వం' ! అది విషాదమయినా కలదారులు వెదుకుతూ జాలువారుతుంది 'కవిత్వం' ఆ రెండు అనుభూతుల్ని ఆపేశక్తి ప్రపంచంలో యేవ్యక్తికీ లేదు !

మనసు అనుభూతించడం మొదలయితే అంతా పదాల మయమే. అది కవిత, గీతం, గజల్..... ఏ పేరుతో నైనా పిలువబడవచ్చు !

ఏది యేమైనా ..... అది ఒక హృదయావేశం !

హృదయాన్ని స్పందింప చేసే ఏ్వంత ఆలంబన దొరికినా ఆ ఆవేశం అక్షరాలుగా నర్తిస్తుంది. జీవిత లక్ష్యంగా వెలుస్తుంది.

తియ్యని అనుబంధం ..... పీడని ఆలంబనగా మారితే ఆ అనుభవం. ఆనందాన్ని ఆవిర్భవిస్తుంది.

అటువంటి 'ఆనందం' దినదినప్రవర్థమానమై ఆ ఆలంబనను మరింత పటిష్టపరుస్తూ జీవితాన్ని రసమయంగా మారుస్తుంది.

అటువంటి రసవాహినిలో పూర్తిగా తాదాత్మ్యం చెందిన 'కవిగారు' (శ్రీ ఆకునూరు గోపాలకిషన్‌రావు గారు) తన అనుబంధపు సౌరభాలను, అనుభూతుల పారవశ్యాన్ని తన్మయత్వంతో తనదైన బాణీలో ఆలాపించిన అక్షర రూపాలే యీ ''కవిగారి స్వగతాలు'' !

శ్రీరావుగారు తన మధుర వర్తమానాన్ని, అందులోని ఆత్మీయులని, మరుపుగతంలోనికి జారి పోనీయకుండా భావి తరాలకు మార్గదర్శకంగా వేసుకున్న బాటలు ఈ ''స్వీయ గీతాలు'' !

ప్రతి శీర్షికలోను తనతో ముడిపడ్డ వ్యక్తి (వ్యక్తుల) గురించి స్వేచ్ఛగా, స్వచ్ఛంగా, హృదయేచ్ఛగా కవిత్వీకరించారు.

ఆయన ముందే చెప్పారు... ఈ కవితల సంపుటి ద్వారా ఇతరులను స్పందింపచేయడం తన లక్ష్యం కాదనీ, తన ఆలోచనలనీ, అనుభవాలనూ,

అనుభూతులనూ ఆత్మ సాక్షిగా ఆత్మ తృప్తిగా పదాలలో బంధించుకోవడం ఒకటే తన ఆకాంక్ష అని !

అయినా చదవిన వారిలో కొందరికైనా ''నేను నావాళ్ల గురించి యిలా ఎందుకు రాసుకోకూడదూ'' ? అన్న ప్రశ్న ఉదయించడం ఖచ్చితంగా జరుగుతుంది !

అది కూడా ఒక రకంగా ప్రేరణే !

''ముద్రణలో, పుస్తకరూపంగా చూసుకోగలమా, లేదా'' అన్నది పట్టించుకోకుండా, హృదయంలో ముద్రించుకొన్న మమతానుభూతుల్ని కాగితం మీద బంధించగలిగితే, అది ఎంతో తృప్తినిస్తుంది. ఆ తృప్తిని ఎవరికి వారు స్వయంగా అనుభవించాల్సిందే ! అటువంటి తృప్తినిదాటి, అవధులు లేని సంతృప్తితో తన 'స్వగతాల'కు పుస్తక రూపమిస్తున్న శ్రీ గోపాలకిషన్‌రావు ''కవిగారు'' ధన్యులు.

ఏ వ్యక్తీ .....

తన అనుభవ భాగ్యాన్ని కాల గర్భంలో కలువ నీయగూడదు !

తనదైన భావ ప్రపంచాన్ని సమాజానికి దూరం చేయగూడదు !!

తనలోని స్పందనను సమాధి చెయ్యగూడదు !!!

నా దృష్టిలో అవి హత్య, ఆత్మ హత్యల కన్నా హేయమైన నేరాలు !

అనూహ్యమైన రీతిలో అసాధారణమైన అనుభవాలనెన్నో చవిచూసిన సహనశీలి, సహజకవీ, ఓర్పుకు, ఓదార్పుకు మారుపేరైన 'కవిగారు' మరెన్నో మంచి కవితా సంపుటాలను వెలువరించి, సాహితీ ప్రపంచంలో తనదైన స్థానాన్ని పొందాలని ఆశిస్తూ, ఆ కాంక్షిస్తూ .....

**– శర్మాజీ**

**శ్రీ ధాత దీపావళి,**

**10-11-96.**

# అన్నయ్య ఆశీస్సులు !

వైదిక, పౌరాణిక గాథల అనువాద ప్రక్రియగా ప్రారంభమైన తెలుగు కవిత కాలక్రమాన నామ, రూప, వస్తు గుణాద్యనేక పరివర్తనలని స్వీకరిస్తూ నేడు ఆంధ్రదేశంలో విస్తృతంగా వచనకవితా రూపంలో దినదినాభివృద్ధి నందుతూంది !

కొందరు పూర్వచ్ఛందస్సుతో మొహంమొత్తి మరి కొందరు అభ్యుదయంపేర, ఇంక కొందరు అవగాహనలేమితో సాంప్రదాయిక కవితకు స్వస్తి చెప్పి వచన కవితా రూపానికే ఎక్కువ ప్రాధాన్యతను ప్రాచుర్యాన్ని ఇస్తున్నారు. విప్లవోద్యమాలను ప్రోత్సహించే రణన్నినాదాలకు వచన కవితా శైలిలో యేదో సౌలభ్యం గోచరిస్తున్నట్టున్నది ! అయితే వచన కవితకు ప్రాణమైన అంతర్లయని సైతం విస్మరించి వచన కవితని శుద్ధ వాచ్యంగా చెబుతున్న వారూ వున్నారు. ఇది అంత ప్రోత్సహించదగిన విషయం కాదనే నా అభిప్రాయం ! కొందరు నా ఈ అభిప్రాయంతో ఏకీభవించక పోవచ్చు ! అట్టివారితో నాకు గానీ నాతోవారికి గానీ వాగ్వివాదాలకు పేచీలకు ఆస్కారం వుండరాదని నా మనవి !

నేటికీ కొందరు సవ్యసాచులుగా పూర్వచ్ఛందాన్నీ, వచన కవితనీ రెంటినీ అనుసరిస్తూ జోడు గుఱ్ఱాల స్వారీ చేస్తున్న వారూ లేకపోలేదు. అలాంటి వారిని నేను అభినందిస్తాను.

ప్రస్తుతం కావ్యకర్త చి॥ గోపాలకిషన్ ఉభయ కవిమిత్రుడు కావడం హర్షించదగిన విషయం. అత్యంతాధునిక వచన కవితతో బాటు ఇతడు తెలుగు కవిత్వంలో అతి ప్రాచీన ప్రక్రియగా అనేక నీతి బోధలకు వాహికగా నిలిచిన శతక రచన గూడ చేసినాడు.

ఒక అపూర్వ విశిష్ట ప్రయోగ ప్రక్రియగా తన జీవితంతో అవినాభావ సంబంధంగల సమస్త అనుభవాలను, అనుభూతులను సాకల్యంగా స్మరించి, సంస్తుతించి తన ఉన్నత సంస్కారాన్ని తన రచనల ద్వారా రుజువు చేసుకుంటున్న ధన్యజీవి గోపాలకిషన్.

పుట్టి బుద్ధి యెరిగన నాటి నుండి తెలిసి యెవరికీ యేనాడూ, ఎలాంటి అపకారము, అన్యాయము తలపెట్టని, చేసి యెఱుగని తనకు అనూహితంగా తగిలిన కొన్ని దెబ్బలకు విల విల్లాడిన సందర్భాలు ఇతని కవితల్లో (కోకొల్లలు) కనిపిస్తై!

హృదయపూర్వకంగా సాటి మానవుణ్ణి నిస్వార్థంగా ప్రేమించిన వాడికి ప్రేమ లభించపోగా ఈర్ష్యా, ద్వేషాలు లభించినప్పుడు ఆ వ్యక్తి హృదయం విలవిల్లాడటంలో అసహజమేమైనా వుంటుందా ?

తన మనస్సుని అర్థం చేసుకోగల మనిషి తటస్థ పడితే తన కనుపాపల్లో కలకాలం నిలుపుకో గల మనస్వి గోపాలకిషన్.

ఇక చివరగా ఒక్కమాట –

యే పరిస్థితుల్లోనూ తన మనస్సుని దాచుకొనక నిర్భయంగా, నిష్కర్షగా, నిర్ద్వంద్వంగా చెప్పగల నిజాయితీ నిజమైన కవి లక్షణంగా వున్న ఈ వయో యువ కవిని మనసారా అభినందిస్తూ భవిష్యత్తులో మరిన్ని ఉత్తమ రచనలు చేయాలని ప్రోత్సహిస్తూ, ఆశీర్వదిస్తూ

**దీపావళి** — **అన్నయ్య**

**10-11-1996** — **దేవులపల్లి సుదర్శన్**

విశ్వమాతాసదన్, శ్రీనగర్ కాలనీ (ఉత్తర)
వడ్డెపల్లి, హన్మకొండ.

# అంకితము

**నా** రచనలలో లాగే నా యీ అంకిత ప్రస్తావన కూడా ఎంతో విశేషతను సంతరించుకొన్నది. ఎంతో వినూత్న పంథాలో నడుపవలసివస్తున్నది.

50 సంవత్సరాల క్రితవే నన్ను ''కవిగారూ'' అని పిలిచెడి నా పెద్ద మేనమామయ్య, ప్రేమమూర్తి, కరుణాళుడు, సుకవి కీ॥ శే॥ శ్రీ దేవులపల్లి వేంకటేశ్వర రావుగారికి (దేవేరా) మొత్తంగా నా కలంనుండి జాలువారే అక్షరాలన్నీ అంకితం. ఆయన నా చదువు విషయంలో చూపించిన ఆత్మీయత ప్రోత్సాహాలనన్య సామాన్యాలు. ఆయన ఋణం నేను తీర్చు కోలేనిది. ఆయన భార్యామణి కరుణ కూడా అన్నిటిలో ఆయన సమ ఉజ్జీయే. 'కవిగారూ' అని యేభై యేళ్ల క్రింద పిలిచే వాడు. ''కవిగారి స్వగతాలు'' కని వినేందుకు చక్కని సమయానికి నా కోరికపై, నా మనుమడు చి॥ ''అమోఘ'' రూపంలో వచ్చి నన్ను ధన్యుణ్ణి చేశాడు. నా అణువణువుకూ అంకితార్హుడే కదా ?

ఇక ఐదవ తరగతి మావూరు వెంపటిలో లేనందున నాల్గవ తరగతినే పునః పునశ్చరణ చేస్తున్నతరి తమ దరికి హన్మకొండకు నన్ను రప్పించి వారి వద్ద పెట్టుకొని చదివించిన పార్వతీ - పరమేశ్వరులు, ఉదాత్త గుణశీలురు, నాకు విద్యాదాతలు, నా అమ్మమ్మా - తాతయ్యలు, శ్రీమతి దేవులపల్లి అండాళమ్మగారు, శ్రీ దేవులపల్లి కేశవ రంగారావుగారు. ఇద్దరూ కీర్తిశేషులే. బిడ్డ పిల్లలను కొడుకు పిల్లలను ఒకే రీతిగా చూచుకొన్న అవ్యాజ ప్రేమమూర్తులు. వారిచ్చిన విద్యాగంధమే యీ చిన్న పాత్తానికందం. అందుకని వారు నా ఈ ప్రథమ రచనా సంపుటి కృతిభర్తృత్వానికి పూర్ణార్హులు. వారికే యీ సంకలనం భక్తితో అంకితం. వారికి నా నమోవాకములు. వారి వాత్సల్యం ఆ పైనుండి నాపై ఎప్పుడూ కురుస్తుందని నా ప్రగాఢ విశ్వాసం.

వారిచ్చిన ఘనాఘన ఆస్తిని (దాదాపు 500 ఎకరాల భూమి, మూడిళ్ళు, కేజీ బంగారం) వేం దక్కించుకోలేక పోయినా తాతయ్య నాన్నమ్మలు కీ॥ శే॥ ఆకునూరుఅప్పారావుగారు శ్రీమతి ఆకునూరు వెంకట నర్సమ్మగారు మాకాస్తి దాతలే. వారితో నాకు సాన్నిహిత్యం కాస్త తక్కువే (వేర్వేరు వూళ్లలో వున్నందున). అయినా వారిద్దరూ ప్రేమమూర్తులేనని నా మనో ఫలకంపై చిన్ననాడు ముద్రింపబడిన జ్ఞాపకం. అంతటి ఆస్తిని స్వహస్తములతో సముపార్జించి పరిశ్రమలో తుమ్మెదనే మరిపించి ప్రగతి సాధించిన క్రియాశీలితాతయ్య. ఆయన అంశలన్నీ పుణికి పుచ్చుకొన్న మా వాడు

చి॥ ఆకునూరు గౌతం నిజంగా అదృష్టవంతుడు. తాతయ్య రక్తము, ధనము పంచుకొన్ననే నాయనకు వాటిని సిరగా మార్చి సమర్పిస్తున్న నివాళి యిది.

ఇక తల్లిదండ్రుల ఋణమది తీరేది కాదేమో ? నాకీ శరీరము ఆకారము రూపము గుణములనిచ్చి పోషించి పెద్దచేసి నేను పెద్ద చదువు చదివి గొప్పవాణ్ణి కావాలని హృదయ పూర్వకముగా ఆశించి అది ఫలించినపుడంతగానే సంతసించి యింకా యింకా ఆనందిస్తూనే వున్న గౌరవనీయులు నా మాతా పితరులు శ్రీమతి ఆకునూరు రాధాదేవిగారు శ్రీ ఆకునూరు లక్ష్మి నరసింహరావుగారు. డెబ్బై పడిలో కొడుకులూ కూతుళ్ళూ, మనమలూ, మనుమరాళ్లు, ముని మనుమలూ, మునిమనుమరాళ్లతో ఓ పెద్ద కుటుంబానికి పెద్దలు. వారూ యీ అంకిత గౌరవానికర్హులే.

ఇక చివరకైనా చిన్నయే మాత్రం కాని, నేను 'అన్నయ్య' అని పిలుచుకొనే నా చిన్న మేన మామయ్య. అన్నయ్య మరియు మామయ్య విధులే కాక ఒక స్నేహితుడు, ఒక వేదాంతి, ఒక మార్గదర్శి విధులన్నిటినీ వాటి శిఖర స్థాయిలో ప్రపంచంలో యే మేనమామ తన మేనల్లునికి చేయనంతగా నిర్వర్తించిన మేధావి చతుర్భాషా (తెలుగు, ఇంగ్లీషు, ఉరుదు, హిందీ) పండితుడు, కవి శ్రీ దేవులపల్లి సుదర్శనరావుగారు. వరంగల్‌లో సాహితీ సమాఖ్యలో సమున్నత స్థానం కల కమనీయ కవి మిత్రుడు. అయన శ్రీమతి, శ్రీమతి దేవులపల్లి సరోజినీ దేవి అంతేగా ఉదాత్తజీవి. భర్త అడుగు జాడలలో తమకున్నంతలో యితరులకు సాయంచేసే తల్లి. ఇద్దరూ నన్ను తమ పిల్లలకన్నా ఎక్కువగా ప్రేమించి ప్రోత్సహించడం, నా అదృష్టం. అంత పెద్దకవికి నాయీ స్వగతాల కుసుమాల వాసనలనందించ గల్గడం నా పూర్వజన్మ సుకృతంగా భావిస్తున్నాను. ఆయన రచనలు ముద్రించి కాస్తైనా అయన ఋణం తీర్చుకోవడానికి నేను సన్నద్ధుణ్ణే. ఒక విధంగా చెప్పాలంటే ఆయనవి ముద్రించాకే నావి ముద్రించుకోవడం సమంజసమూ న్యాయము నా అభిమతమూను. కాని ఒక్కొక్కతరి పరిస్థితుల ప్రాబల్యం, అనూహ్య ఆలోచనా సరళి కాలవైరం ఎన్ని పనులో మన మనుకున్న వనుకున్నట్లుగా చేయనీయవుకదా ? ఇప్పటికైనా నన్ననుగ్రహిస్తాడని ఆ అవకాశం నాకు కల్పిస్తాడని అభ్యర్థిస్తున్నాను.

జీవితాంతం ప్రతి పని ప్రతివారికి ఎంతో అంకిత భావంతో నిర్వహించిన నేను అంకితమనే పదానికే ప్రతిరూపాన్నేమో ? నన్ను తమ వాడనుకున్న నా వారందరికీ నేనెప్పుడో అంకితమై పోయిన తరి నాలో జనించిన నా రచనలన్నీ అలాంటివారందరికీ అంకితాలే !

**నరక చతుర్దశి** — కవిగారు

**9-11-96** — **ఆకునూరు గోపాలకిషన్‌రావు**



కీ.శే. దేవులపల్లి కేశవరంగారావు గారు
కీ.శే. దేవులపల్లి అండాళమ్మ గారు
నా విద్య దాతలు
ఈ కృతి స్వీకృతులు



కీ.శే. దేవులపల్లి వేంకటేశ్వరరావు గారు (దేవేరా)

నన్నో కవిగా ఊహించి
సర్వదా 'కవిగారూ' అని పిలిచి
నలభైయారు వత్సరాల క్రితమే
నా 'క్రాంతిసేవ' గమ్యం చూపించి
నా గుండెలో నిలిచినవాడు
నాకు గొప్ప వరదాన్యుడు
పెద్ద మేనమామయ్య 'దేవేరా'
పెద్ద మనీషి వందనీయుడు !

# ‘దేవేరా’ వరం ‘కవిగారు’

(1948 - 1949)

పెద్ద మామయ్య ‘దేవేరా’
పెద్ద కవి తానే యైనను
పెద్ద మనసుతో గొప్పగ
చిన్నప్పుడు తాను నన్నెప్పుడు
‘కవిగారూ’ అని పిలుచువాడు
ఎందుకనే వాడో తోచక
వెర్రి మొహం వేసేవాణ్ణి
ఇన్నాళ్లకు ఇన్నేళ్లకు
ఆ మహనీయుని భవిష్యవాణి
అయ్యింది మరోసారి నిజం
అరశతాబ్ది అనంతరం
ఆయన వాక్కు బ్రహ్మవాక్కయె
ఆయన మాట అక్షరాల నిజమయె

ఆ మహనీయుడుతా
నన్న మాట నిజమవగా
నన్నే కవిని చేయగా
తానే నాలోన పూనెనుగా
లేకున్న నేనేమిటి !
ఈ కవనాలేమిటి ?
ఎన్నడు లేనిది ఎప్పుడు లేనిది
ఈ ముది వయసున నిలా
కవి నగుటేమిటి ?
అంతా ఆశ్చర్యం కాదా
వింతయునూ యిది కాదా
ఆయన నాతో పలికించగ
వ్రాయగలుగు చుంటి నేమో ?
ఆయన భవిష్యద్దర్శనానికి
అర్పిత మాయన 'కవిగారు'

ఆయన మహనీయతకు

అర్పించెద నీరాజనాలు

ఆయన కవితా హృదికి

అర్పణ నాయీ కవిహృది

ఆయన మదిలో మెదల

అర్పింతు నశ్రుతర్పణం

ఆయన దివ్యస్మృతికిదె

అంకితాలు నారచనలు

ఆయన ఆత్మ శాంతికే

ఆహరహమూ ప్రార్థించెద

ఆయన మనో దీవెనలే

నా యీ రచనా కుసుమాలు

ఆయన నా యింట పుట్టాలని

ఆశతో ఆకాంక్షిస్తున్నా

ఆయన వరమీ 'కవిగారు'

అదే నా యీ భూరి 'కలంపేరు' !

21-4-95

# మౌన రణం

మనసులోన రొద గాండ్రిస్తుంటే మౌనాన్ని పదును పెట్టుకో
దారి ఊబిలా లాగేస్తుంటే ధైర్యాన్ని ఎక్కుపెట్టుకో
అవరోధాలేవీ లేకుంటే అది జీవితమే కాదులే
సమస్యలే తెగ కురుస్తుంటే సహనాన్ని తలకు చుట్టుకో
విషమ క్షణాలు వేగిపోనిదే వేచిన ఫలం లభించదోయ్
ఎదురుగ ఉదయం నిలిచేదాకా హృదయాన్ని చిక్కపట్టుకో
వేసే బాణం పది శిరసులతో విరోధి ఎదురైనప్పుడే
కుత్సితులెవరో మొరుగుతు వుంటే క్రోధాన్ని అదుపు పెట్టుకో
కసి ఉమిసే నిందలకు జడుసుకుని కలత పడితె ఏం లాభమోయ్
ధూర్తుల నాలుక లూడేదాక దుఃఖాన్ని పాతిపెట్టుకో
ఎక్కిన పీఠానికి సార్థక్యం ఎదకు చూపులున్నప్పుడే
ముచ్చట్ల పూల జల్లుకు మురియక మూలాన్ని వెతికి పట్టుకో
పచ్చి నిజాలు భరించలేక పైపై వైరాగ్యాలెందుకోయ్
బాకులు చుట్టూ దిగుతూ వున్నా లోకాన్ని అంటిపెట్టుకో
తప్పుకాదు 'నా' అనే తపన ; అది తన పరిధిలోన నిలిస్తే
సంఘాన్నే మింగేసే కపట స్వార్థాన్ని అదిమి పట్టుకో
మంచితనాన్ని ప్రబోదించే ప్రతిమనిషికి పరీక్ష తప్పదోయ్
దుర్మతులెందరు పోట్లు పొడిచినా ధర్మాన్ని చేత పట్టుకో
కడదాకా నీ అడుగులె నీతో నడిచి రావులే 'సినారే'
కావలసిన వారే వెళిపోతే కాలాన్ని వెంట పెట్టుకో !

**డా॥ సి. నారాయణరెడ్డి**

పై గజల్ నా తొలి రచనకు ప్రేరణ, స్ఫూర్తి మరియు జనని – జ్ఞానపీఠ్ అవార్డు గ్రహీత, పద్మభూషణ్ ఆచార్య సి. నారాయణరెడ్డి గారిది. దీనిని ఆంగ్లంలో **'Silent Strife'** గా ఉర్దూలో **'Jung-e-Khamoshi'** గా అనువదించి చూపి శ్రీ రెడ్డిగారి ఆశీస్సులు పొందాను. ఆంగ్లంలోనే రచనలు చేయమని ఎంతగానో ప్రోత్సహించారు. నా ప్రథమ రచనకు మూలం, నా ఆంగ్లానువాదం నా కవితా సాగర 'గంగోత్రి' గా పొందుపరిచాను.

20-2-95

# THE SILENT STRIFE

Sharpen your silence when the mind is turbulent
Bow your courage when the way bogging is evident

Without obstacles ups and downs life is no good fare
In pouring puzzling problems adopt patience as headgear

Long awaited hopes fructify but on transit of bad time
Hold your heart and wait till you behold sunshine

When the enemy confronts with all his ten-headed fury
Control your passion against barking beasts and be wary

Fear or perturb the jealous accusations not
Bury your sorrow till the rogue tongues are rout

Position you hold is justified when looked through heart
Rejoice not prate flowery flattery - reality always aim at

Unbearable harsh realities pseudo-ascetic make you not
Should daggers hit around deter from humanity not

'Self' within some limits is no sin anyway
Hold back if society it feigns to sway

Preachers of 'Good' face wrath through ages
Hold 'Dharma' to annul all the evil daggers

In your ultimate journey your very feet desert
Befriend 'Time' "C Na Re" when kith and kin desert

**"KAVI GARU"**
**20-2-1996**

జ్ఞానపీఠ అవార్డు గ్రహీత, పద్మభూషణ్
ఆచార్య సి. నారాయణరెడ్డి గారికి గౌరవ పురస్సరముగ
ఆయన మౌనరణం అనువదించగానే 25-2-95 తేదీన.

"మౌనరణం"

సుమధుర
సుమనోజ్ఞ
సుబోధ
ప్రవచనముల
బహుజనుల కందించు
భావనకు స్పందించి
ఆంగ్లమున ఉర్దూలో
అందించు సాహసము
ఆ లోక పాలకుని
ఆజ్ఞయే కాబోలు
సాధ్యమైనంత
చక్కగానే నేను
మీ భావ జాలమును
అనువదించితిని
నా పిచ్చి పలుకులకు
నవ్వు రాకుంటేను
నా ప్రథమ యత్నము
కాదొక కళింగ యుద్ధము
'ఎల్ల జీవకోటులపై
చల్లుము ప్రేమామృతమ్ము'
నా యీ చిన్న ప్రయత్నానికీ
నా జీవితానికే కడవరకు 'స్ఫూర్తి' !
అందుకే మీరు నా
కభివందనీయులు
అందుకే మీరు నా
కాదర్శ ప్రాయులు
ఎన్నినాళ్ల నా అభిమానము
నలభై యేళ్ళ నాణ్యతతో
ఇన్ని నాళ్ళు వేచి వేచి
ఈ నాడొక నందనమై
మీ వాకిట పూచినది !
మీ నాగార్జున
సాగరం ద్వారా
ప్రవృత్తిలో నన్ను
విశ్వాత్మజుని
విశ్వమానవుని
చేసిన మీరే
వృత్తిలో నా
కొమరుని కూడా
విశ్వమానవు చేయ
పురికొల్పినారు
గురుదేవునిగా నా
సహధర్మచారిణికి
చక్కగా ఎం.ఏ. లో
చదువు చెప్పారు.
ఈరీతి మా యింట
మీ ప్రభావమ్ము
ఇంతయని అనలేము
ఇది యే నిజమ్ము !



# జ్ఞాన తేజం

జ్ఞానపీఠ్ అవార్డది
కానము యాభై ఐదులోన
కాని వుంటే అపుడది
నాగార్జున సాగరము
ఆర్జించి పెట్టెడిది
నారాయణ రెడ్డిగారి కది
అంతలేసి కావ్య కన్య
అది నిజంగా ఓ ధన్య
ఆయన కావ్యాలన్నిటిది
అదే గొప్ప ఒరవడి
ఈ రీతిగ విశ్వంభరది
యెన్నవ జ్ఞానపీఠ మది
ఆయన వ్రాసే గజల్లది
అదో క్రొత్త ఒరవడి
పుట్టు చుండె జ్ఞాన జలధి
ముచ్చటైన ముత్యాలవి
జ్ఞాన పీఠమే ఆయన
ఆయనదే ఆ పీఠము
ఇతర జ్ఞాన పీఠములు
యేమి లెక్క ఆయనకు
ఆదిత్యునికే చుక్కల
నర్పించిన భాతియవి
తెలుగు ఆకసాన ఆయన పేరు
వెలుగు చుండు నిరంతరము !



10-12-95

# బుజువై పోయింది ప్రియా !

నిన్ను విడిచి వుండలేని
అసక్తత అంతకంతకూ
పెరిగిపోతోంది
సముద్రపు
'నీలి' కెరటాల్లాగ
నా ప్రేమ కెరటాలు
ఎగిసి పడుతున్నాయి
నా హృదయం విలవిల్లాడుతోంది
నీవులేవు – ప్రేమలేదు
నీవులేవు – తృప్తిలేదు
నీవు లేవు – నవ్వులేదు
నీవులేవు – నేనే లేనట్లుగా వుంది !
నీవు కనిపిస్తే . . .
ప్రేమించ కుండా
ఉండలేక పోవడం,
దూరమయితే . . .
దూషించడం లోనే కాలాన్ని
కాల్చేస్తుండడం . . .
ఏంటి . . . ఇదంతా !
ఏది ఏమైనా . . .
నా తృప్తంతా నీ తోనే
ముడిపడి వుందన్నది
బుజువై పోయింది ప్రియా !!

– శర్మాజీ



# BONDS OF LOVE

**Not able to live**
**Without you my love**
**My helplessness is growing**
**Me very frail It's making**
**Like the blue oceanic waves**
**Soaring are my affection ones**
**My heart is aching**
**I am perhaps dying**
**No love - Sans you**
**No laughter - Sans you**
**No peace - Sans you**
**No myself - Sans you**
**When together living**
**When away cursing**
**What is this ?**
**the fact remains**
**Bonded are our lives !**

***'KAVI GARU"***

ఫిబ్రవరి – మార్చి 95 ప్రాంతంలో మయూరి వీక్లీలో ఫినిషింగ్‌టచ్‌గా చూసి ఎంతగానో నచ్చి వారం వారం వచ్చిన శర్మాజీ గారి 'నన్ను నీకిచ్చేశాను' ప్రేమ కవితలు ఆంగ్లంలోకి ఏక బిగిన అనువదించి అను సంకలనంగా ప్రచురణకు సిద్ధం చేసినాను. అందులో నేను మొదటిగా అనువదించిన కవిత 'ఋజువై పోయింది ప్రియా' మరియు నా Bonds of Love లను 'యమునోత్రి' గా చూపు తున్నాను.

– 'కవిగారు'

# విద్యాదాతలు

అమ్మమ్మ తాతయ్యలు
ఆది దంపతులె వాళ్ళు
కేశవరంగారావూ
ఆండాళమ్మ అభిధానులు !

ఇద్దరికీ నేనంటే
ఎంతగానో ఉండేదిష్టం
వారి యింట బొల్లికుంటలో
బహుధాన్యలో పుట్టినాను
వారి ప్రేమ ఆశీస్సులె
ఈ రోజుకూ మాకు రక్ష
వారిచ్చిన ఘనసంస్కారం
వారిరువురి నుండి మాకు భిక్ష
దేవతలే వారైనందున
దేవ లోక మేగిరి వారు !
ఆ లోకం నుండి అహరహం
ఆశీస్సులు కురిపింతురు
అవే మమ్ములందరినీను
సర్వదా కాపాడు చుండును !



# ఆస్తిదాతలు

నానమ్మ తాతయ్యలు
నాకలోక వాస్తవ్యులు
ఆకునూరు అప్పారావు
వెంకట నర్సమ్మ అభిధానులు

వారి గూర్చి చాలా వివరంగ
వ్రాయ గలట్టి సంపర్కం
నాకు వారితో లేనందున
నాల్గు ముక్కలే తెలిపెద
తాతయ్య కూడబెట్టె
తరగని పేద్దాస్తిని
అమ్ముకొని మ్రింగితిమి
అవలీలగ అంత మేము
తాతయ్య విదల్చగ
ధనం నేను చూడలేదు
కష్టజీవి తాను అనుభవించ
కనలేదు సుఖమును
నాన్నమ్మ మనసది
ప్రేమసుధా భరితము !





# తిరుమలేశుడు

**పెద్ద మామయ్య 'దేవేరా'**

పెద్ద మనసు కల మనీషి!
పెద్ద చదువు లేకున్నా
పెద్ద బుద్ధి జీవి యతడు!
తనకు తెలయనట్టి దేదీ
లేదనిపించు తెలివిగల
దిట్ట తాను మొదటి నుండి!
గట్టు మీద కూర్చుని తను
కవిత్వాలు వ్రాస్తుంటే
ధాన్యలక్ష్మి తనకు తానె
ధాన్యరాసు లొసగేది!
గొడుగు నుండి విమానం వరకు
దేని మీద యేమి వ్రాసినా
''థీసిస్‌లా ఉండేవవి!
అంతలేసి వివరాలతో
''అథెంటిక్'' గా వుండేవవి
నలభైతొమ్మిదిలో నేను
నాల్గవ తరగతి పాసైతే
నూరునోటు నాచేత బెట్టి
''కవిగారూ! మీరు నిజంగా
గొప్ప విజయం సాధించారు
పోయి పార్టీచేసుకొండ'' నె!
''ఇంతటి ఉదారులిలలో
ఇంకొకళ్ళు వుంటారా''!
అన్ననా అనుమానం
ఈనాటికి తీరలేదు!
ఆయన కొడుకు పిల్లలకు
అంతగానే అభిమానంగా
పది పన్నెండంతలు నేను
పంచియిచ్చి నాను, అయినా
ఆయనదో అచ్చమైన
ముత్యంవంటి ఔదార్యం
నాదేమో నకలుదైన
''జాపాను'' వాని ముత్యం
ఆయన తన నిర్వచనమహో
భాగవతం వ్రాసినపుడు
''పోతన తోడ పొత్తునకు
బోవ తలంపను'' అనె!
ఆయనతో పొత్తునకు
నేనే యెడ పోగలను!
ఆయన ఉదార నగ ముందు
ఆవ గింజ నా ఔదార్యం
ఆయన పాండిత్యం ముందు
అర్భకుడను ఆ విషయ మందు!
నలభై రెండేళ్ల ముందె
తానేగె స్వర్గమునకు
స్వర్గమునకే అని నేను
ఖచ్చితంగ యేల అంటినా
తన చివరి ఓ రచనలో (తాను)
ఘనముగా యిలాగ వ్రాసె
''పూర్తిగ గుండెపట్టొడిసి
పోవుచు నున్నది నీవలాన
నా ఆర్తి వలాన కొంత తడి
ఆరుచు నున్నది కొన్ని

నాళ్లలో కార్తిక కృష్ణపక్ష
మనగా క్రమరీతి నుడింగి
పోయినన్ కీర్తుల కేమి
స్వర్గములకే అధికారము
పొందుదీశ్వరా''
ఎంత ఆత్మ సత్తా అది !
యేమి సమయస్ఫూర్తి అది !
''కవిగారూ'' అని ఎల్లప్పుడు
నన్నాయన పిలుస్తుంటే
ఎందుకనో యెంతోచక
వెర్రిమొహం వేసేవాణ్ణి !
అరశతాబ్ది అనంతరం
ఆయనన్న మాట నిజం
ఐన వైనం తలచు కొంటె
ఆయన ఆత్మ బలం ఆయన
వాక్శుద్ధి గుర్తు కొచ్చె
అదేమో కాని ఆయన
ఆ ఆకాలంలో అపుడపుడూ
భవిష్య వాణి పలికే వాడు
అది నిజమై తీరేది !
జ్యోతిష్య శాస్త్రమో
సాముద్రిక శాస్త్రమో
నుదిటి వ్రాత శాస్త్రమో
బుద్ధిజ్ఞాన శాస్త్రమో
సంఖ్యామహా శాస్త్రమో
ఇంకేదో శాస్త్రమో
ఏదో ఒకటో లేక అన్నినో !
ఆ బుద్ధి జీవికంత
అవలీలగ అబ్బెనేమొ !

ఒకనాడు నాతల్లికి
అంటే ఆయన చెల్లికి
ఓ పుత్రుని కడుపుకోత
గండ మామె కున్నదని
భవిష్య వాణి చెప్పి నాడు !
ఆరునెలల లోపు గానె
అపుడు చిన్న కొడుకు వాడు
ఆయమ నాల్గో తనయుడు
నా అనుంగు తమ్ముడు
తాను చనిపోయినాడు !
తన చావు కూడ తాను
ముందుగనే తెలిపె మాకు
తను చెప్పిన నెల లోనే
తానేగెను స్వర్గమునకు !
విలపిస్తిమి మేమంతా
ఆ అకాల మృత్యువునకు !
ఆయన భార్యామణి సాధ్వి
ఆమె పేరు కరుణ (రుక్మిణి)
కరుణా మయి నిజంగానె
మరువ లేను నే నామెను
పసిడి మేని ఛాయ లోన
పద్మావతి తానేమో !
చిన్న తనము కాన నేను
ఆమె గూర్చి అంత గాను
తెలియ కుండె నాకు గాన
తెలుపలేను మిక్కిలిగ
భర్త కన్న ముందె తాను
సుమంగలిగా వెళ్లెను
ఆయన చనిపోవు ముందు

.....

3

తిరుమల దర్శించివచ్చి
దేవులపల్లి వెంకటేశ్వరరావు
తన పేరైయున్నందున
అనుకొంటిమి మేమంతా
''ఆ దేవుడే ఆయనయని
అందుకనేమో అతడు
అంత గొప్ప బుద్ధి జీవి''
ఆయన ఆత్మలీనమై
కాయంమాకైవచ్చిందని
''కవిగారూ'' అని పిలిచినపుడు
వెర్రి మొహం వేసినోణ్ణి
కవిగా అర్హవై రోజులు
పూర్తి యైన తరుణాన
'కవిగారూ' అను ఆయన పిలుపు
కాకతాళీయంగా నిజమైనా
అపర ''రోటర్ డామస్‌గా''
ఆయన నా కనిపించెను !
బ్రహ్మంగారేమో నని
భ్రమ కూడా కలిగెను !
అంతటి విజ్ఞాని తాను
అవతరించ కోరు తాను
నా యింట మనుమనిగా
నన్నుతరింప చేయుటకు
నా కవనాల్పొచుటకు
నన్నానందింప జేయుటకు !!

20-4-95

-- ❁ --

# జననీజనకులు

లోకానికి సృష్టికర్త
లోకేశుడు తానైతే
మనల సృష్టిచేసినది
మన అమ్మా - నాన్నలు !

అందుకనే వారి నెపుడు
పూజిస్తుండాలి
అహరహమూ వారి సేవనే
చేస్తుండాలి !
అమ్మ మనసు ఆకాశం
అది యెంతో ఉన్నతం
అంతేగానూ సున్నితం
అగునుకదా నవనీతం !
నాన్న మనసు పాతాళం
లోతు తెలియడం కష్టం
పైకి మాత్రమే కఠినం
లోలోపల మృదు మధురం !
ఆ యిద్దరి ఆశీర్వాదం
మన పాలిటి బ్రహ్మావరం
మనకిచ్చును ఆనందం
మన బ్రదుకుల చేయు ధన్యం !!



# మాతృదేవత (అమ్మ)

అమ్మ నేను మఱువలేదు
కమ్మని నీ అమ్మతనం
ఇంజనీరింగు చదువుకునే
రెండవ యేడనుకుంటా
పందొమ్మిది వందల యేభైతొమ్మిదిన
సౌతిండియా టూరు కెళ్తూ
పదిగంటల రాతిరపుడు
వచ్చినాము ఖాజీపేట
ఆదినాన అంతరేతిరి
అవస్థ అని నీవనుకోకుండా
ఒక్కదానివే వచ్చినావుగా
అన్నయ్యకూడా వచ్చి యుండెనా
అన్నదినాకు గుర్తులేదు
నాకు అన్నమూ తెచ్చినావుగా
దగ్గర కూర్చుని రైలులోపల
ముద్దలు కలిపి చేతికిచ్చితివి
అమ్మప్రేమ అదేనని
అనుకుంటిని ఆ దినాన
అమ్మప్రేమ పొందినట్టి
తనయుడె ధన్యుడు కదా ?
అమ్మ ప్రేమలేని యెడల
ఆ తనయుడు ఎదగలేడు !
అమ్మప్రేమనిండుగాను
ఆమె పిల్లలందరికీ
ఒకేరీతి ఒక్కింతగ
చిక్కాలని కోరుతాను !

ఏమాయెనో యేమొగాని
మన యింటి గూర్చి నేను
కనినట్టి కలలన్నీ
పటాపంచలై పోయెను !
ఇంతదురదృష్టం నాకు
ఎందుకిచ్చెనో ఆ దేవుడు
ఏ పాపం చేసినట్లు
ఎరుగనెపుడు నేనైతే !
నాకు యింక మిగిలింది
మీ యిద్దరి ఆలోచనే,
నేను కోరుతున్నది
మీ యిద్దరి సంతోషమె !
అందఱికీ ఎంతో కొంత
అరమరలేకుండ చేసినాను
ఈ వయస్సులో మీరిద్దరు
ఎంతో ఆనందంగా వుండాలని
అందుకు నే నేమయినా
ఆచరించుటకు సిద్ధమే :
మీ కోర్కెలు తెలియచెప్పి
నాకవకాశం కల్పించండి !
అహరహమూ మీరిద్దరు
ఆనందంగా వుండండి
మీరాయురారోగ్యాలు
మెండగుచూ వర్ధిల్లండి !
సుఖశాంతులతో మీరు
ఇక పై యిద్దరు బ్రతకండి !



# పితృదేవుడు (బాపు)

బాపూ నీకోరికనా
కాదర్శం అయినది
నీవాశించినట్టు నేను
పెద్ద చదువు చదివినాను
పెద్ద ఉద్యోగం చేసినాను
పెద్ద పేరు తెచ్చుకున్నాను !
అనాడెన్నడో కదా
నేనింకా చిన్నవాణ్ణి
నాల్గవ తరగతిలో
చదువుకుంటున్న వాణ్ణి
సవారీ కచ్చడంలో
మనమిద్దరమే ఆనాడు
రామన్నగూడానికి
పోతున్న తరుణాన
నీవు చదువు కోలేదని
నీవు వుద్యోగం చేయ లేదని
ఎంతో బాధపడి పోతూ
ఎంతో విచార పడిపోతూ
నేను చదువు కోవాలని
నేనుద్యోగం చేయాలని
నీ మనస్సు విప్పితివి
నీ కోరిక తెలిపితివి !

నీ మాటనె వేదంగా
నీ ఆశనె ఆశయంగ
నిజంగానే కష్టపడి
నీ కోరిక తీర్చినాను.
అంతటితో వూరుకోక
స్వంత మేలు చూసుకోక
తమ్ముళ్లను చెల్లెళ్లను
నాలాగే చదివించాలని
వాళ్ళ కాళ్ళ మీద వాళ్ళు
నిలిచేలా చేయాలని
నావంతు కృషిని నేను
ఏమాత్రం వెనుకాడక
నాకున్న పరిధి లోన
అందరికీ చేసినాను !
నిజము మీకు తెలియనిదా
నైజము నాది తెలియనిదా !
అందరూ చదువుకోగా చూసి
ఆనందించినాను నేను !
నాటి నుండి నేటివరకు
నమ్మండి మీరు నన్ను
చిన్న మెత్తు స్వార్థమైన
చేరలేదు నాలోన !



.....

2

నావాళ్లనుకున్న
నావారి నందఱినీ
ఒకే రీతి చూసినాను !
ఎవరేమని అనుకొన్నా
అవమాన పడలేదు నేను
తప్పు చేయనట్టి నేను
ముప్పుకెలా భయపడతాను !
జీవితాన అనుకొన్నవి
కావన్నీ అందఱికీ !
సరిగ్గా యిలాగే నిజంగా
జరిగింది నా విషయంగా !
అయిన దేదో అయినది
అది మన రాత నుదుటిది !
అమ్మా - మీరూ సుఖంగా
ఆనందంగా వుండాలన్నది
మీకున్న కోరికలను
నాకున్న పరిధిలోన
తీర్చాలని మాత్రమే
ఇపుడు నా ఆశయం
ఇపుడు నా ధ్యేయం
కోరుచుంటి నే నిపుడు
మీరాయురారోగ్యాలు
మెండగుచూ వర్ధిల్లండి !



# ఆదర్శ మార్గదర్శి

సుదర్శన్ అన్నయ్య నా
కాదర్శం చిన్నప్పుడు !
చిన్నమామయ్య తానైనా
'అన్నయ్య' అని పిలుస్తాను !
చిన్నప్పటినుండి నేను
చేరువరకుద్యోగ మందు
నన్నెంతో ప్రోత్సహించి
నా చదువున అడుగడుగున
తా చనువుగ సహకరించె
నా కొక స్నేహితునిగా
నా కెంతో హితునిగా
నా కతి సన్నిహితునిగా!
తానే నా వేదాంతిలా
మహా మంచి మార్గదర్శిలా
నడిపించె నన్నెల్ల వేళల!
నాకెన్నో తెలియ చేసె
నాగమనం సులువుచేసె
ఆదర్శము లెన్నొనాకు
ఆప్యాయత వల్లించెను!
అనుభవాలుకోకొల్లలు
తనకుతానుగ తెలియజేసె!
స్వార్థమనేదే తెలియని
సంఘజీవి ఆ అన్నయ్య!

తమ్మునికాదర్శం
లక్ష్మణుడే తానైతే
అన్నలకగు ఆదర్శం
ఆ నా అన్నయ్య తాను!
ఎన్నెన్ని చెప్పెనో
ఏమేమి తెలిపెనో
అన్నిటినీ ఆకళించి
అన్నిటినీ ఆదరించి
అభిమానం పెంచి పెంచి
అన్నిటినీ ఆచరించి
ఆయన అడుగుల ముద్రల
జాడలనే చరియించితి!
నాలోని ఆశయాలు
నాకున్న ఆదర్శాలు
నా అన్ని గుణగణాలు
నాకాయనిచ్చిన వరాలు!
ఆయన వెలిగించినదే
నాలోని ప్రేమ జ్యోతి
ఆయన కలిగించినదే
నాలోని సేవాస్ఫూర్తి !!
ఆయన భార్య సరోజిని
ఆమెయును ఔదార్యధని !
వారిద్దరు ఉదారంగ



.....

2

నా చదువుకు సహకారులు !
అన్నయ్య తాను కూడా
ఆరి తేరినట్టి కవియె,
నాల్గు భాషలందు కూడా
నాణ్యముగా వ్రాయగలడు !
ముచ్చటగా వ్రాయగలడు !
వ్రాసినాడు రచనలెన్నో
వాసికలవె అన్నీను
కాలం తన కెన్నడూ
కలిసిరాని కారణాన
వ్రాతలనచ్చున చూడాలను
వాంఛ తనకు తీరలేదు !
ఆ అవకాశం నాకిమ్మని
అడిగినాను ఈ మధ్యనె !
యేవిషయం నాకుతాను
ఇదమిద్ధం తెలుపలేదు !
కాలమే పరిష్కరించు
కాగల కార్యాలనెపుడు !
ఇన్నినాళ్ల తరువాత యిపుడు
ఈయన కవితాంశకూడ
నాయందు ప్రవేశించి తాను
నన్ను కవిగ చేసేనేమొ !
నరంలేని యీ నాలుక
నానావిధుల పోతోంది
మేనమామ పోలికలు
వస్తాయని అంటారుకదా
అది నాకీ విషయంలో
అచ్చముగా జరిగేనేమొ ?
పెద్దమామ చిన్నమామ

ఇద్దరునూ కవులగుటన
ఇద్దరి యీ పోలికలూ
ముద్దుగ నా కబ్బుట !
అదియును ఇన్నాళ్లకు
అరవై దరిదాపులలో
అబ్బురమనిపించెను
ఆనందం కలిగించెను !
ఈయనఋణాన్ని నేను
యే విధితీర్తునను భావం
నాలో పాతుకు పోయెను
లోలోపల బాధించెను !
ఎంతో కాకతాళీయంగా
ఆయనకూ అత్తయ్యకు
వారి పిల్లలకు కూడా
నా అర్థాంగీ నేను కూడా
కాస్తో కూస్తో సహాయం
కాగలిగింది లేదనక
చేయగలుగు సహాయం
చేతనైన పరిధిలోన
చేత ఎముక లేనట్టుల
చేసి తృప్తి చెందితిమి !
ఇక్కడ కూడా మాకు
చుక్కే ఎదురైనది
నామట్టుకు నేనైతే
ఏ మాత్రం మారలేదు

## 3

ఆదర్శి అన్నయ్యకు
సోదర లక్ష్మణుడినే !
ఆనాటికిష్టయ్యనె,
ఆ ప్రేమసుధానిధినె
అంతేగా శ్రమా ధనినె
విశాల విశ్వమానవునినె
అన్నయ్య చెక్కినట్టి
ఉన్నత శిల్పాన్నే !
కాలమొకటె తీర్చగలదు
కదా అన్ని కల్మషాలు !
హృదయమొకటె విచారించు
సదా అన్ని కలుషితాలు !
కల్మషమే లేకున్నా
కలత పడే హృదయాలు
నిర్మలమగు పేరుతో
నిలువ గలుగు నిజాలు
మనగలవెంత సేపవి
మబ్బు చాటున వెలుగులు
అన్నయ్య గురుచరణ సన్నిధి
కర్పణ నా యీ చిరుపెన్నిధి.
అన్నయ్యకూ అత్తయ్యకూ
ఆ కరుణా మయునాశీస్సులు
మెండుగ వుండాలని
గుండె నిండ కోరుకొందు
ఆయురారోగ్య ఐశ్వర్యాలు !
అవాలి సదా వారి సొత్తులు !!



# ఆత్మకథ

'అమ్మకృప' నా నిలయం
'ఆకునూరు' వంశాభిధ
నాన్నమ్మ తాతయ్యలు
నాకంతగ తెలియరు !
అ ఆలనుండి నేర్పిరిలే
అమ్మమ్మా తాతయ్యలే !
ఆది దంపతులు వారే
ఆదర్శం మాకు వారే !
ఎంతో వుదారుడతడు
పెద్దమామయ్య 'దేవేరా' !
ఆయన అర్ధాంగి 'కరుణ'
అంతే మహనీయురాలు !
అందు కేనేమో ఆ యిద్దరు
ఆ దేవుని పిలుపు మీద
ఎంతో కాలం ముందే
ఏతెంచిరి స్వర్గానికి !
వారి అనుంగు బిడ్డడు
కోదండ రాములు కూడ
వారి నొదిలి మనలేకమో
వారి కొఱకు పరితపించి
చిన్న వయసు లోనే తాను
చేరు కొనెను తలిదండ్రుల !
లక్ష్మీనరసింహ రావు నాన్న

రాధా దేవి తల్లి నాకు
ముగ్గురు నాకు తమ్ముళ్లు
ఐదుగురేమో చెల్లెళ్లు
అందరూ తమ తమ పరిధులలో
ఆనందంగానే బ్రదుకు తున్నారు !
నా మిత్రుడు స్నేహితుడూ
నావేదాంతి, మార్గదర్శి
నా కన్న తల్లి తమ్ముడు
నా చిన్న మామయ్య తాను
నేనతనిని ప్రేమమీర
''అన్నయ్యా'' అని పిలుస్తాను !
సుదర్శన్ రావు నాకు తను
ఆదర్శం చిన్న నాడు
ఆయన వెలిగించినదే
నాలోని ప్రేమజ్యోతి !
ఆయన కలిగించినదే
నాలోని సేవాస్ఫూర్తి !
అన్నిటిలో దీటు అతని
సతీమణి సరోజిని !
అన్న భార్య ఐనందున
తల్లి లాంటి వదిన తాను !
వీరెంతో వుదారంగ
మా చదువుకు సహకారాలు

వీరిద్దరి ఋణం మేము
యేమయినా తీర్చ లేము !
ఇంటికి దీపం నాకామె
యేమని చెప్పను నా శ్రీమతి
యస్వీ రావు కనక దుర్గాంబలు
నా అత్తా - మామ లొసంగిన
నాకో మంచి బహుమతి !
అన్నా - తమ్ముడు చెల్లెల్లిద్దరు
ఆమెకున్న సహోదరులు
ఎమ్మే తెలుగు తానపుడు
అమ్మాయిలకు లెక్చరరు!
మొట్ట మొదటి చూపులోనె
ముదము గొల్పె నామె నాకు
కమ్మని కోకిల మధుర కంఠం
అమ్మడు అయ్యెను నా స్వంతం!
గోపాలకిషన్ రావు నా
అభిధ కాంతిశక్తి నా వృత్తి
అనుకోకుండా కలిసిన మేము
అరవై మూడున దంపతులం!
అప్పటి నుండి యిప్పటి వరకు,
అనురాగాలే మాయింట,
ఆనందాలే మాపంట,
కాంతి నిలయమే మా యిల్లు,
శాంతి భరితమే మా బ్రతుకు
మా యీా నందన వనమందు
పూసెను ముదముగ
పూవులురెండు
మొదటి పువ్వు స్వప్న సుందరి
గౌతం బాబు వంశోద్ధారి
ఇద్దరినీ మేమెంతో ముద్దుగ
పెంచు కొంటిమీ ప్రేమ మీరగ
వారి బాల్యము కౌమార్యము
గురుతే లేని వేవేగాన
ఇద్దరూ ఎంతో త్వర త్వరగ
చకచక తాము ఎదిగి పోయిరి !
నా నిండు ప్రేమ నా కలల సుత
నా గుండె చప్పుడు నా తనయ
నా ఆశలు ఆశయాలు
పూర్తి చేసె తను డాక్టరయి !
వృత్తి లోన వెలుగొందు చున్నది
వృద్ధిలోకి వస్తున్నది
జనావలికి వైద్యసేవలు
ఘనా ఘనముగ చేయుచున్నది
అల్లుడు శ్రీకృష్ణ తోడుగా
ఆనందంగా గడుపు తున్నది
కంప్యూటర్ బిజినెస్‌లో
తను కైజర్ అల్లుడు కృష్ణ
ఎంతో విజయ వంతంగా
ఎదుగు తున్నాడు వృత్తి పరంగా
అందరితో కలిసి మెలిసి

ఆదరంగా మసలు తాడు !
కాంతి కటక శాస్త్ర మందు
ఎంతో నిపుణుడు గౌతం
తెలుగు విశ్వ విద్యాలయ మందు
తనకై ఒక గూడు చేసుకుని
తనంత తానే యెదుగుతూ
ఘనంగా పై కొస్తున్నాడు
గత మేలో శైలా కుమారిని
శ్రీమతిగా తెచ్చుకొని
తామిద్దరు సుఖ శాంతుల
మా తోడనే ఉన్నారు
ఇంటి దీపము చమురు నంతా
ఇంటి కోసమే యిగరచేసి
జ్యోతి కాంతి సుంత తగ్గినా
దేదీప్యంగా వెలుగు తున్నది
మూడు పదుల ఐదేండ్ల
ముచ్చటైన నా ప్రజా సేవ
నా ''కాంతి శక్తి'' వాడుక దార్లకు
ఖచ్చితముగ అందించితి
ఆరు నెలలలో నే యిక
అంతముకా బోవు సేవ
నాకెంతో ముదమిచ్చినది
నాకు గర్వం తెచ్చి పెట్టినది
యువలో నన్నా వహించిన
యువత స్ఫూర్తితో మళ్లీనేను
ఈ మధ్యే మొదలిడితిని
ఇంకో మంచి ప్రజాసేవ
కాంతిశక్తి ప్రజాసేవ
చాల చేసితిని గాన
క్రాంతిశక్తి ప్రజాసేవ

చేయపూను కొంటి నేను
నా స్వామిణి పీహెచ్‌డీ . .
నా రాణి చదువుల రాణి
నే మొదలెట్టిన ఈ
నా సాహిత్య సేవా
ప్రగతి పథంలోనూ
ఆమెయే నా రేరాణి
సహ ఊహా కారిణి
చక్కని ఆచారిణి
ఇన్ని యేళ్లు నా ధర్మం
నిర్వహించు స్ఫూర్తి నిచ్చి
సుఖ దుఃఖాలన్నిటా
నా కంటే ధైర్యంగా
నాకంటే దృఢముగా
అన్నిటా నిలద్రొక్కు కొని
నా తోనే నిలబడి నాతో
తా నున్నానని వెన్ను చరచి
నా బ్రదుకును సుఖమయం
చేసిన కరుణామయికి
ఎంత రుణపడి పోయినానో
ఏ విధి దాన్ని తీర్చ గలనో
రెండు నెలలు కూడ యింక
కాలేదు కవినయి నేను
అయినా యీ కవితా వెల్లువ
ఆగకుండ వీగకుండ
అచ్చటగా ముచ్చటగా
ఆర్భాట యుక్తంగా
ఒక ఝురి లా సాగి సాగి
కానుందో సాగరం !!



# 60 రోజుల కవిత్వం

అర్వై రోజుల గుర్తుగ
ఆరీ పద్యాలు వ్రాసి అర్పింతును
నేను రుణ పడియుంటిని నీకు
యే రీతిగ తీర్చుకొందునే సహవాసీ !

అరవయి రోజుల లోనే
చెరువయి పోయెను కవితలు
శ్రీమతి గారూ ! కరుణది వాణిదివుంటే
త్వర లోనె సంద్ర మగును స్వర్ణగోపాలా !

ఈ కొద్ది రోజులందే
నా కా వాగీశ్వరి పూనకంలా వచ్చే
ఈ కవితా ధోరణిపై
నాకే ఆశ్చర్య మాయె నమ్ముము స్వర్ణా !

ఇన్నా కొన్నా అన్నా
ఎన్నో ఎన్నో కవితలు యిన్నాళ్లందే
నన్నెవరో తరిమినట్లు
వన్నెగ వాసిగ వ్రాసితి స్వర్ణే వింటే !

అనుకోలే దెన్నడు నే
నను కోకుండా వచ్చిన అదృష్టము కాదా
అనుకొని కవులౌతారా
కనక లతా చెప్పవేమి కాదంటావా !
ఏదేమైననుకానీ
ఏదేవత కరుణో యిది యెరిగిన దేగా
ఆ దేవత కరుణించిన
నాదే యగు వాగ్ధాటిది నా కుండు లతే !

ఎవరే మనుకున్నను నే
చివరికి ఒక చిన్నమాట చెప్పేస్తాలే
నీవే నా ప్రాణేశ్వరి
నీవే నా ప్రాణ ప్రియవు నిజముగ స్వర్ణే !



-- ❋ --

20-4-95

# నేత్రవైద్యజ్ఞ

ఆకునూరు వంశమందు
ఆద్యుడివీ చదువు లందు
ప్ర ప్రథమ డిగ్రీ గ్రహించిన
ప్రథముడివీ నీవెనయా !
మా కెల్లర కాదర్శమైన
డాక్టరు వంతేకాక
'సర్వేంద్రియాణాం
నయనం ప్రధానం
నయనాలకె డాక్టరుగా
పైకి నీవు ఎదిగినావు !
వేలవేల దీనులకు
కనుచూపును కలిగించి
ఆదరమూ పొందినావు !
ఆశీస్సుల గ్రహించావు !
నీవిచ్చిన కంటిచూపు
నేత్రదాన మంతటిదే
ఆధ్యాత్మిక శిఖరమును
అందజేసే నీకావిధి !
నిను మెచ్చిరి జన జాలం
నీకది గర్వంకాదా !
గురువులాగ గొప్పవాడి
ననిపించు కొన్నావు
మన ప్రజాసేవ యెపుడు
మహితంగానే వుండెను
అంతకన్న కావలసిన
అదృష్టం ఇంకేమిటి ? !

అంతకన్న మించి నట్టి
ఆదర్శం వేరేమిటి !
జన్మసాఫల్యం కన్నా
జయ మింకే మున్నది !
మనము మంచి మనసుతో
ప్రజాసేవ చేసినాము
మన వంతు ధర్మాన్ని
ఘనముగ నిర్వహించాము !
మనము ఎంతగానో జనుల
మన్ననలు పొందినాము
మన మన కుటుంబాల
చక్క దిద్దు కొన్నాము
మనకు కలిగి నంతలోన
సంత సించు తున్నాము
ఆధ్యాత్మిక రాచబాట
అనుసరిస్తు వున్నాము
మీరంటే మొదటినుండి
నాకెంతో ఆదర్శం
మీరు కూడా ప్రేమమీర
నన్నభిమానించి నారు
మీ యీ అభిమానానికి
నేనెంతో ఋణపడినాను
మీ యీ వాత్సల్యానికి
ముగ్ధుడనై పోయినాను
మనలో మనమధ్య
ఋణాలేమి టంటారా

2

ఉపకారం బరువెంతో
తెలిసివున్న వాణ్ణి నేను
పూలదండ పడక ముందె
వంగుతుంది తల కదా
నాన్న వెనక నాన్న లైన
చిన్నాన్న గారు మీరు
చిన్నమ్మ గారు కూడ
వెన్నె లాంటి మనసు తల్లి
మీ పిల్లలందరునూ
మంచి మనసుగల వాళ్లే
తాతగారి ధర్మాలుగూడ
తగిన రీతి నిర్వహిస్తున్నారు
మీ జన్మ ధన్యతకు
ఇదే కదా నిదర్శనం !
ఏ. వీ. యస్. రావు గారూ
ఏమను కోకుండ మీరు
నా గుండె అడుగు నుండి
నే పలికిన ఈ పలుకులు
నానిండు రెండు నెలల
కవిత యిచ్చు కుసుమాలు
స్వీకరించండీ పెద్దవారు
ఆశీస్సేసల చల్లండీ
అహరహమూ
సుఖశాంతులతో
ఆనందంగా
వర్ధిల్లండీ !!

(రిటైర్డ్ ఐ స్పెషలిస్టు డా॥ ఏ వీ నర్సింహారావు చిన్నాన్న గారిపై)



# నిర్వేదము

ఎవరి కేమి చేయ నపుడు
ఏమి బ్రదుకు నాదిది !
ఎవరి ప్రేమ పొంద నపుడు
ఏల బ్రదుకు నా కిది !
బ్రదికినన్ని నాళ్ల నేను
చితికి చితికి బ్రతికి నాను
బ్రతుకంటే రోతపుట్టె
చితికెందుకు చేర్చవు నన్ను
చావొస్తుందేమోనని
జడుస్తారు అందరూ
చావెపుడొస్తుందా యని
జంకు లేక కాయు చుంటి
నా మట్టుకు నేనైతే
ఏ మాత్రం వెనుకాడక
అందరికీ ఎంతో కొంత
అందించితి కరుణను
పరిధిలోన అందరికీ
విరివిగానె తోడ్పడితిని
ముద్దాయిగ యిపుడు నీకు
ముందు నిలిచి యున్నాను
వాదనల వినుము నీవు
వ్యాజ్య నిజానిజాలను
త్రాసు లోన తూచి చూచి
దోషులెవరో నిర్ణయించు
తగిన న్యాయమును పలికి
తగిన న్యాయి వనిపించు !



# ఒకేవైపు దారి

అమ్మాబాపూ యిద్దరికీ
తమ్ముళ్ళకు చెల్లెళ్లకు
నా భార్యా బిడ్డలకు
నా వాళ్లందరికీ
యేమేమో చేయాలని
యెాంతగానో తపించి నాను
ఉమ్మడిగా కుటుంబం
ఉండాలను ఆశయం
ఆదిలోనే హంసపాదయి
అడుగంటి పోయినది
చివరికి మిగిలినవీ
చిన్నచిన్న కుటుంబాలు
అనుకున్నంతా కాకున్నా
అందరికీ ఎంతో కొంత
నాకున్న పరిధిలోన
చేశానన్న తృప్తినాకు
చివరికి మిగిలింది !
ఎవరికది పట్టింది !
ఒకేవైపు రహదారి
బ్రతుకు నాదయింది !!



# శ్రీ చిన్నమల లింగమూర్తి

బహుమతు లిచ్చుటలో
బహుదిట్ట లింగ మూర్తి
ఆయన నాకందించె నో
అపురూపమైన బహుమతి
సాహిర్ లుథియాన్వీ
సమగ్ర కవితల నిధి
వెల కట్టలేని ఈ పెన్నిధి
ఇక పై నిది నా సన్నిధి !
ఆయన ఈ ఔదార్యానికి
పోయితి నెంతో ఋణపడి
తీర్చు కొందు దీన్ని నేను
తీయని నా కవితలందించి !

---

విద్యా రత్న బిరుదానాడు
శ్రీమతి కొచ్చిన నాడు
ఈశ్వర చంద్ర విద్యా
సాగరుని చిత్తరువది
సందర్భోచితముగ
చక్కగ తాను యివ్వగ
ఆయన పై నా అభిప్రాయము
అయెను మరో సారి నిజము
ఎలా తీర్చుకో గలము
మే మాయన యీా ఋణము !



# శని మహారాజు

శనీశ్వర గ్రహరాజు
చక్కని మా మహారాజు !
శ్రద్ధగ తనపని తను
చక్కగ చేస్తుంటాడు
బ్రహ్మనైన శివునైనా
బహుశః తను వదలడు !
తన విధి నిర్వహణలో
తల మన మేల దూర్చవలె !
మన లాగే తను కూడ
తన పని తదేకంగ
చేయకుండ ఆపనేల ?
చేసి పూజ లాయనకు
ఆరు వత్సరాల నుండి
నన్ను కాచు చున్నాడు !
వెన్ను తట్టు తున్నాడు
యేడున్నర వత్సరాలు
ఎవరినేని పూనెనేని
విడువకుండ వెంటాడి
నీడలాగ నిలుస్తాడు !
అదియేమో మహాత్మ్యం
ఆయన మన వెంటనున్న
ఆపూర్తి కాలమందు
మనస్తాప సంతాపాలు
లేని పోని అపనిందలు
ఈర్ష్యా ద్వేషాలు పగలు !
ఇన్ని అన్ని అనలే నన్ని
'ఇన్సల్టు'లు ఈసడింపులు
నీడకూడ మనలతాను
వీడి పోవు పరిస్థితులు
వేలకు వేలు కోకొల్లలు
పిచ్చిలేవ చేయు మనకు !
అపుడపుడూ మాత్రం
అనుకోకుండా ఏదో ఒక
మంచి మనకు జరుగు తుంది !
మనలను తా మురిపిస్తుంది !
ఈశని పూనిన కాలము
ప్రతి శనివారము ఆ దేవుని
ప్రార్థించి శాంత పరచ
తిలాతైల అభ్యంజనము
తలపై నుండి చేయించి
నల్లతిలలు నల్లబట్ట
నైవేద్యం సమర్పించి
ఆపై నవ ధాన్యాలను
భక్తి తోడ అర్పించిన
ఆ దేవుడు శాంతించును !
ఆశీర్వదించు మనలను !
"సాడేసాతీ నుండి మనం
సవ్యంగా బయట పడితె
ఆ శని మహారాజు
కర్పిద్దాం పైవన్నీ !
ఆయన మహాత్మ్యాన్ని
వేనోళ్ల పొగడు దాము
ఆయన ఔదార్యాన్ని
అందరికీ చాటు దాము !!



# నీ పరిశ్రమం

చిన్ననాటి నుండి నాకు
ఉన్నది ఓ చిన్న కోర్కె
చిన్నదైన ఓ పరిశ్రమ
మిన్నగ నెలకొల్పాలని
అందులోన పనిచేయు
అందరినీ అందులోన
భాగస్తుల చేయాలని
భాగ్యాలను పంచాలని
ఆపరిశ్రమ ఇంతింతై
ఆకాశ మంత ఎదగాలని
అది ఆ భగవానుని
పాదాలనే తాకాలని
ప్రపంచంలోనే అది
ప్రాచుర్యం పొందాలని
'తనకు తాను సుఖపడినా
తప్పుది కాకున్ననూ
తనవారిని సుఖపెట్టుట
ధన్యత'న్న "సినారె" మాట
నాకాదర్శం ఆది నుండి !
నాకాచరణీయం సదా !

నిర్మల స్వార్థ రహిత
కర్మలలో ఎల్లప్పుడు
నాతోనే ఉండి నాడు
నా వెన్నును చరిచి నాడు
నా కోర్కెలు తీర్చి నాడు !
నా బలమే ఆ దేవుడు
ఈ చిన్ని కోర్కెకూడ
యే రీతిని తీర్చ గలడో !
నను వింతగ కవి చేసిన
తను కాడా దయా మయుడు
ఎవరి కెపుడు యేమివ్వ వలె
ఎరుగును తానన్ని కూడ
సరియైన సమయ మందు
చక్కగ సమకూర్చు నన్ని
మానవత్వ విలువలకే
మహిత మహిమాన్విత ధ్యేయం
నిస్వార్థంగా తలపెట్టిన
నిర్మల కార్య క్రమమిది
దైవ దివ్య దీవనలతో
తగు రీతి వర్థిల గల

## 2

ఆ ఆదర్శ పరిశ్రమలో
ఆయనయే ప్రథమ భాగస్వామి
ఆయన తరువాతనే
అందరమూ నిలుచువారం
నేనాయన చేతికింద
నిష్కామ కార్మికుణ్ణి
నిలువెల్ల సేవకుణ్ణి
మిగిలిన వారందరికీ
మిత్రుడి లాంటి వాణ్ణి
పైవాడి ప్రక్క వాడి
మన్నన లందడమే
అన్నలాంటి నా కోరిక !
పూర్తి చేయ వయా దేవ
పుణ్యమూర్తి దయా మయా
నీ పరిశ్రమ శుభ కామన
ఈ నా సత్సంకల్ప సాధన !!



# నాగుండెకు జబ్బేమిటి

మే రెండవ తేదీ నాడు
పది గంటల సమయ మందు
ఆగి పోయి కొంతసేపు
సాగి పోయె తిరిగి గుండె
నా గుండెకు జబ్బేమిటి ?
నా కొచ్చే ముప్పేమిటి ?
కొన్ని నాళ్లగా ఏలనో
ఉన్నా ఊడినా కూడా
ఒకటే లా వున్నది !
కానీ నేడెందుకో
గౌతంకై కొన్ని నాళ్లు
ఉండాలని వున్నది
నేను మెచ్చు పనులు చేయు
వాని కీర్తి పతాకాలు
చూడాలని కోర్కెకలిగె !
గుండె ఆగు నింకెటుల ?
వాడప్పు చెప్పిన పనిని
చూడటాన్కి నేడు నేను
ఇంటిపట్టునే యుంటిని
ఇంటి వెనక పనిచూస్తూ
పదిగంటల ప్రాంతమందు
పది నిమిషాల పాటు
గుండె ఆగినట్లు తోచె
వాచీలో చూసు కొంటే
బీ.పీ యే చూపదాయె
ఈ.సీ.జీ బదులు అందు
తిన్న గీత కనిపించెను !

అదే సమయ మందు గౌతం
అలవాటు ప్రకారంగ
టెలిఫోను తానుచేసె
గుండె ఆగి వున్నపుడే
నిండు బాధలో వానికి
నే చెప్పితి దాని గూర్చి
అరగంట లోపే తాను
పరుగెత్తుకు వచ్చుకొంటు
''అరుణ్‌బజాజ్'' డాక్టరును
ఆఘమేఘాల తీసుకొచ్చె !
అప్పటికే నా వద్ద నున్న
అరుణ్‌బజాజ్ ముందిచ్చిన
ఒక గోలీ వేసుకొంటి !
చకచక తా గుండె సాగె
డాక్టరు పరీక్షలన్నీ చేసి
అంతా సవ్యమే నని
మందు వాడు వివరాలను
మళ్లీ మళ్లీ తెలియ చేసి
వెళ్లి పోయే కాఫీ తాగ్రి
ఆ పై గుండె విధిగా
సాఫీగా తాను సాగె !
గౌతంకై బ్రతకాలను కుంటే
గౌతమే ఆగుండె నాదుకొంటే
యేమనాలి యీా విచిత్రం
ఇది కాదా విధి వైచిత్ర్యం !
నిస్వార్థ మైన కోర్కెలెల్లా
నిజమగు నేమో యిల్లా !



# నల్ల బల్ల పని

ముప్పై ఐదు వత్సరాల
మదుద్యోగ ధర్మమందు
ఎన్నెన్నో అనుభవాలు !
ఎన్ని దుర్దర్శనాలు !
కాగూడని వన్నీను
కలలాగ జరిగిపోయె !
కావలిసిన దేదీను
అవకండా మిగిలిపోయె !
అన్యాయా లెన్నెన్నో
న్యాయంగా చెల్లిపోయె !
న్యాయమైన వన్నీను
అన్యాయం పాలయ్యెను !
అర్హతలేని ఎందరో
అందలాల నెక్కినారు
అర్హతతో ఎవరికీ
అవసరమే లేకపోయె
అర్హులంత నిస్ప్రహతో
అల్లలాడి పోయినారు !
జాత్యభిమాన మనే
జాడ్యమ్మై యుండ నోవు
అనర్హు లెల్లప్పుడు
అనర్హులకే సహాయం
కుచ్చులనే కొరికినట్లు
కొల్లలుగా చేసినారు !
పై.వారెల్లప్పుడు
ఈర్ష్య విషం కక్కినారు !
క్రిందివారు మాత్రమే
చిందిరి ప్రేమామృతం
యేది యేమి ఐననూ
ఎంత నేను నలిగిననూ
వృత్తి ధర్మమును ఆదర్శమనే
వత్తి ఆరకుండు నటుల
కాలంలా ఖచ్చితముగ
కడ వఱకూ నిర్వర్తించితి !
నా కర్తవ్య మర్థించిన
నా, నానా వాడుక దార్లకు
నాతో పని చేసిన
నా సహోద్యోగులకు
నయముగ వినయముగా
నా శక్తుల పరిధిలోన
పరుగిడి నా సేవలను
బాగుగ అందించి నాను !
ఈ విషయంగా తృప్తి
ఎంతగానో నా కుంది
కాంతి శక్తి సంస్థ లోన
నుంత శక్తి వంచించక
ఎంతో వుత్సాహంతో
సంతసముగ పనిచేసితి !
వింతలెన్నో తిలకించితి
విరమించు చుంటి పదవి !!



# దుర్భరం

కొందరికి జీవితం
కుదురుగ ఓ స్వర్గం !
నాకేమో జీవితం
నరక లోక సదృశం !
ఆశించిన వాటికీ
అనుభవించు వీటికీ
అగు పడక సమన్వయం
ఐనది బ్రదుకు దుర్భరం !
బాధల కొన్నిటి నెలాగో
భరించ వచ్చు బ్రదుకున
బ్రదుకే బాధైతే
భరించేది ఎట్టుల ?
నేనైనా యే తరినీ
నేర మేమి చేయ లేదు
నాకు తెలిసి యెవ్వరికీ
నష్ట మేది చేయ లేదు !
చేయని తప్పుకు శిక్ష
చిత్ర మిదియె కాబోలు !
మంచి తనానికి వంచన
మహిమ యిదే కాబోలు
తప్పును నేను దరి చేర్చిన
దెప్పుడునూ లేకున్నను
అహరహమూ ఎల్లెడలా
అన్యాయమె అనుభవం !
ఇది నాకే ప్రత్యేకం !
ఇదే నాకు జీవితం !!



# జ్ఞాన పుంజం

ఇంటిదీపము పుట్టిన రోజు
ఇంటికెల్ల మరిపండగ రోజు
ఇంటి వెలుగుకై చమురంతా
ఇగిరించినది నిస్వార్థంగా !
సుఖాల తానాశించక
సుఖపెట్టినది మమ్మల్ని !
అరగదీసి తన అవయవాలు
విరజిమ్మె నింట పరిమళాలు !
ఇంటిలోని కణ కణమూ
చాటి చెప్పు తన ఋణమూ !
విద్యా శిఖరాన తా వాణి
బోధనలో గొప్ప ఆచారిణి !
తలలో నాలుక అందరికీ
తనకు తనే సాటి చివరికి !
విధి నిర్వహణలో తనుమేటి
విజయ పథానికి లేనిది పోటీ
'విద్యారత్న' బిరుదు గ్రహీత
విద్యా వాప్తి చేసే శక్తి తనకు
విపరీతంగా ఈశు డొసంగ
విన్నపాలు చేస్తూ వున్నాను
రావాలని కోరుతూ వేలకు వేలు
మాకానందమైన ఈ రోజులు !

(శ్రీమతి విద్యారత్న డాక్టర్ స్వ ర్ణలత పుట్టిన రోజు సందర్భంగా)





# స్వర్ణలతోత్సవాలు - కవిగారి గజలు

కాలేజీ ఆధ్వర్యాన నీ ఉపాధ్యాయిని ఘనత ఉత్సవం !
జరిగెను జనవరి ఐదు తొంభై ఐదున రజత ఉత్సవం !

జరిపి వుండదే యాజమాన్య మెవ్వరికీ ఎచ్చటనూ
పండగ లాగా వైభవముగ నా రీతి అంత ఉత్సవం !

అదేనెల ''గణతంత్ర దివసం'' నాడందు కొంటివి
'విద్యారత్న'' బిరుదు నీవది మరెంత ఉత్సవం !

సెప్టెంబరు ఐదుపాధ్యాయుల దినం నాడు
''ఘన ఆచారణి'' సత్కారం మళ్లీ అంత ఉత్సవం !

ఈ నాటి ''సాహితీవేత్త'' ఇంకో 'పురస్కారము'
మా కందరికీ కనువిందైన మరీ ఎంత వుత్సవం !

ఓ 'బిరుదూ' మరో 'సత్కారం' ఇంకో 'పురస్కారము'
వెను వెంటనె జరుగు నెవరి కంత ఉత్సవం !

'బిరుదు' పేరు ముందు సదా నిలుచు నరుదగు సత్కారము
అది చిన్నదా చితకదా మరీ ఎంత ఉత్సవం !

'సత్కారం' శాలువా పని కొచ్చును కొంతకాలము
మూడు నాళ్లె అనుకొనే మురిపె మంత ఉత్సవం !

'పురస్కార' సంతస మది మరీ క్షణకాలమె నిజము
ఆపైనది గూటికే అలంకార మంత ఉత్సవం !

ఉత్సవాల మీద ఉత్సవాల స్వర్ణలతోత్సవం
నీకూ మాకూ అందరికీ ఎంతెంత ఉత్సవం !!



# నష్ట జాతకము

అందరికీ నేనైతే

అమృతమే పంచినాను !

అందరు నాపైనైతే

చింది నారు విషాన్నే !

ఒకడైతే బాధపడొచ్చు !

ఇద్దరైతె ఏడ్వవచ్చు !

అంతా అలాగేనైతే !

ఎలాగని ఏడ్చిచత్తు !

ఏమి నష్ట జాతకము !

ఏమి దుష్ట ఘాతుకము !

ఏమి కష్ట జీవితము !

ఎంత హృదయ విదారకము !!



# బ్రహ్మ వ్రాత

జీవితంలో
ఏ విషయం లోనైనా
ఎక్కడైనా
ఎవరితో నైనా
ఉన్నమాట
ఉన్నట్టుగ అనగల నా
అలవాటుకు !
యదార్థ వాది
లోక విరోధి
అను నానుడి
నిజము కాగ
దిమ్మ దిరిగి
నట్టే వాళ్లు
రిమ్మ తెగులు
వాయాళ్లు
ఎందరు తమ
కన్నులలో
నింపు కొనిరొ
నిప్పులను
ఎందరు నా
మంచిమీద
యేడ్చి యేడ్చి
కుళ్లిరో
ఎంత దృష్టి
పెట్టిరో !

కొంత మంది
మంచి వాళ్లు
నాకు మంచి
కోరి నోళ్లు
సంతసించి
నా కూడా
ఏడున్నర
శని నాతో
తోడున్న
కారణాన
తోడి ప్రజల
శాపాలవి
నీడగ నను
వెంటాడెను
కూడని
చెడుగెంతోనా
కెడ యెడ
తోడాయెను
ఎంతచెడ్డ
అనుభవాలు
ఎదుర్కొంటి
గుండె బలంతో
నైతికమౌ
పతన మది
నాయందున
చేరలేదు !

సైతానది
నా లోపల
సందు చూసి
దూర లేదు !
బాధ లేదు
భయం లేదు
బ్రదుకంటే
తీపి లేదు !
తప్పు లేక
శిక్ష లేయు
పాడు బద్ధ
జగతి లోన
మోడు లాంటి
బ్రదుకు కన్న
వీడుకోలు
మరణం మిన్న
అనుకున్నా
లాభం సున్నా !
అది కూడా
తన యిష్టం
అను కొనెనా
ఆ బ్రహ్మ
భలే వ్రాత
బ్రహ్మ రాత
మార్చ గలమె
తల రాత






ఇంటర్ నేషనల్ అసోసియేషన్ ఆఫ్ లయన్స్ క్లబ్‌వారు బెస్ట్ కమిటెడ్ టీచర్‌గా
డా॥ ఆకునూరు స్వర్ణలతను సన్మానించడం
భారతీయ విద్యాభవన్‌లో టీచర్స్ డే సందర్భంగా 5-9-95 నాడు.



సృజన ఆర్ట్‌క్రియేషన్స్ శ్రీధాత ఉగాది 'సాహితీవేత్త పురస్కారం'
విద్యారత్న డా॥ ఆకునూరు స్వర్ణలత శ్రీ డాక్టర్ పి. నారాయణరెడ్డిగారి కరకమలముల నుండి
స్వీకరించుట 21-3-96 సుందరయ్యకళా నిలయం.




మహబూబ్‌కాలేజ్ హైస్కూల్లో టీచర్స్ ఓరియంటేషన్ ప్రోగ్రాం
దీపం వెలిగించి ప్రారంభిస్తున్న డా॥ అకునూరు విద్యాలత (8-7-96).



గోల్డెన్‌స్టార్ సాంస్కృతిక సంఘసేవాసంస్థ 26-10-96 నాడు త్యాగరాయ గానసభలో గోల్డెన్ స్టార్
పురస్కార్ - '96 'ప్రముఖ విద్యావేత్త' గా
డా॥ అకునూరు విద్యాలతను సన్మానించడం.



బెస్ట్ యంగ్ అకాడమీషియన్ అండ్ క్వాలిఫైడ్ మాన్‌గా శ్రీ. పి. సుధీర్ కుమార్ ఎం.ఎల్.ఏ.
గారి నుండి డా॥ ఆకుమారు గౌతం పురస్కారమందుకోవడం
బల్లెం వేణుమాధవ్ ఆర్ట్స్ థియేటర్స్ నుండి 10-6-1992.



సూర్యచంద్ర సాయిలీలా హోమ్ 1994 టి.వి. అవార్డ్ డాక్టర్ అక్కినేని నాగేశ్వరరావుగారి గారి
నుండి అందుకొంటున్న డా॥ ఆకుమారు గౌతం ఉత్తమ ఛాయా గ్రాహకుడుగా స్వర్గీయ రావి
నారాయణరెడ్డి గారిపై డాక్యుమెంటరీకి త్యాగరాయ గానసభలో 10-6-1995.



అమోఘ



నేనూ - జాతీయత ఉట్టిపడుతున్న అమోఘ (15-8-96)



నా అమ్మా - బాపు నా మనుమనితో



నా అత్తా మామలు, నా శ్రీమతి, కోడలు - మనుమనితో



డా॥ సినారె గారు నా ప్రథమ కవిత విని నన్నాశీర్వదించడం



ఆట పాటలలో ఘనుడు - అమోఘ్ - నా చిన్ని మనుమడు

## గురుపూజోత్సవ సందర్భంగా (5-9-1995)
## అతిచక్కని ఆచారిణి విద్యారత్న శ్రీమతి
## డా॥ ఆకునూరు స్వర్ణలతకు అక్షరాక్షతలు

ప్రపంచం లోనే
ప్రథమ శ్రేణి
అతి చక్కని
ఆచారిణి
అనుట లోన
అతిశయోక్తి
అనలే మాత్రం
ఆవ గింజంతైనా
లేదన్నది
నిర్వివాదము !
నిజంగా నిజం !
విజయ సోపానాలు
విరివిగ ఆరోహించాలి
అంతా ఆశ్చర్యపడగ
ఆపై మెట్టుననే నిలవాలని
సాకల్యముగా
ఆకాంక్షిస్తున్నా !
గురు పూజోత్సవ
గురుతుగ నా యీ
అక్షరాక్షతలు
ఆశీస్సేనలు
అందుకో ఓవాణీ !
ఆదరణీయ నారాణీ !!



# మల్లయ్యగారు

అన్నయ్యకో స్నేహితుడు
పిన్నింటి రాంచంద్రరావు
అన్నయ్య కన్నా చిన్నైనందున
అన్నదమ్ముల్లా ఉండేవారు
మేమంతా యీాయనను
మోాలీసాబని పిలిచేవాళ్లం
ఈయన తండ్రి మాాధవరావు
మల్లయ్యగారనే పంథిని మాాధవరావు
తాతయ కేశవ రంగారావు
గారి పట్వారిగిరి సహకారి
కంతేపాలం దొార వారి వద్ద
సహకారిగా తాతయ్యకుదిర్చె
రాత్రింబవళ్లు కష్టపడి
దొారవారికి కోట్లార్జించి
దొారగా లక్షలు తానార్జించిన
ఉదార గుణాంతరంగుడు
అమ్మను రాధక్కా అని పిలుచు
అల్లునిగా సదా నన్ను తలుచు
మమకారం పంచిన మాాధవరావు గార్ని
మరువ లేను నేనెన్నటికీ !



# పింగళి ద్వయం

ఉన్నత బడి విద్య నే ననభ్యసి
స్తున్న తరి హన్మ కొండలో
అన్నయ్య సుదర్శన్ రావుకు
ఉన్నా రెందరో స్నేహితులు
ఎంతో స్నేహ శీలురు మ
రెంతో కరుణా శీలురు
అందరిలో ముఖ్యులు
సుందర హృదయు లిద్దరు
పింగళి ప్రసాదరావు
పింగళి ప్రభాకరరావు
ఇద్దరు అన్నదమ్ములు
వేరు వేరు ప్రవృత్తులు
అన్నగారు ఆదరణీయులు
ఆయన నా కాచార్యులు
'ఆయ్యూ్య దే వీ హీ షీ ఇట్''
ఇంగ్లీషు గ్రామర్ నందీ బిట్
ఎంత గ్రాహ్యముగ బోధించిరో
ఇంత కాలం గురుతది నాకు
సమర్థుడైన నా ఆ గురువు
తమ తమ విద్యా వృత్తిలో
సమకాలికులై కలిసిరి
శ్రీమతితో సహ బోధకులై
పిల్లలంత స్థిరపడిపోగా
ఉల్లాసంగా ఉత్సాహంగా
కాలం గడుపు తున్నారు
హన్మకొండలో మామాష్టారు
తమ్ముడు ప్రభాకరరావు
తాను కూడా ఓ గురువు
గురుపూజ లెన్నో అందుకుని
విరమించెను తానుద్యోగం
మంచి హృదయమున్న వాడు
నాకయె ననుసరణీయుడు
ఆనాడు నా చిన్నప్పుడు
చూపిన అభిమానం ఇప్పుడూ
చూపుతున్న ఈ మనీషి
'ప్రభూజీ' అనే మా ఋషి
ఆ ఆప్యాయత ఆ వాత్సల్యం
కురిపించు టాయెనకే సాధ్యం
అన్నయ్య సుదర్శన్ రావును
మిన్నగ 'సుదర్శన్‌జీ'' అను
ఆ గౌరవమూ ఆ గురుభావం
అవి ఆయనకే స్వంతం
వారికి పార్వతీ పరమేశ్వరులు
కూరిమి నివ్వాలి సదా ఆశీస్సులు !



# ఫస్ట్ (బెస్ట్) బాస్

ఇరవై యేడు మే నెల
పందొమ్మిది వందల
అరవై సంవత్సరం
జాబులో జాయినవడం
ఫస్టుబాస్ నాకాయన
బెస్టు ఆల్‌టైమ్ బాసూను
జే. వీ. చలపతిరావుగారు
డ్యూటీ రిపోర్టు తీసుకున్నారు.
వెంటనే వెహికిల్ డ్రైవరు
ముకుందంను పిలిపించారు
జేయీ గారికి నెలలో
డ్రైవింగ్ నేర్ప కుంటే
నీకూ ఆయన కూను
నెల జీతం యివ్వన నేను
పనిపై ఆయన శ్రద్ధ
కిదియే ఓ కొలబద్ద
డ్రైవింగ్ తెలియని నేను
ఎంతో సంతోషం తోను
ఆపై సీటులో డ్రైవరును
కూర్చో నివ్వకనే నేను
నాలుగు రోజులలో డ్రైవింగ్
అంతటి మిలట్రీ ట్రక్కు పై
అవలీలగ నేర్చు కొంటి
కొత్త బాసు పరీక్షలో
కొట్టేసితి ఫస్టుక్లాసు
డ్రైవింగ్ నాకాయన వరం
మరువ లేని ఘన కార్యం
అటుపై వుద్యోగం దర్మంలో
అవసర పడిన ఆయుధం
నేను అలాగే పది మందికి
నేర్చుకొనే అవకాశం యిచ్చితి
ఒకడైనా సాధిస్తేనా ?
ఆయన నాకో గురువు
అన్ని వివరాలు నేర్పగా
తనంత ముక్కు సూటిగా
తయారయి నానుగా
ఆయన భార్యామణి
అన్నపూర్ణ లాంటి సాధ్వీమణి
ఆయనకన్నా ఎక్కువగా
ఎంతో ఎంతో మక్కువగా
తన తమ్మునితో బాటుగ
నన్నూ ఎంతో అప్యాయంగ
గారాబం చేసేది
మారాజుగ చూసేది
ఆనాడూ ఈనాడూ
నన్నదే రీతిగా చూస్తారు
ఆదర్శ దంపతులు వారు
అచ్చం దేవతలే వారు !



# 'త్రి' మూర్తులు

విష్ణు బ్రహ్మ మహేశ్వరుల్లా
విశ్వేందర్ గౌతం శ్రీధర్‌లు
ముగ్గురు ముగ్గురే ఘనులు
ముమ్మూర్తిగ త్రిమూర్తులు
మోటూరి శ్రీధరేమొ
మేటి క్రికెట్ ఆటగాడు
ఈటీవి ప్రేక్షకులకు
ఆటగాళ్ల చరితలను
అందిస్తున్నాడు ఘనంగ
స్పందన ఆకాశాన్నంటగ !
విశ్వేందరు నిజంగా విశ్వజీవి
విసుగూ విరామంలేని శ్రమజీవి
మూడవమూర్తి గౌతం
మా వంశ ఆశాకిరణం
న్యాయ శాస్త్ర కోవిదుడు
నానాశాస్త్ర నావికుడు
కాంతి కటక శాస్త్రమందు
కూడ తాను కడు నిపుణుడు
తెలుగు వెలుగుల జీవితాల
తెర కెక్కించుట వాని లీల
వీరిద్దరి సహవాసాన వీడు
భూరి విజయం పొందు తాడు !!!
ఈ ముగ్గురి జీవితాలు
ఐశ్వర్యానంద మయాలు
కావాలని ఆశీస్సులు
చల్లవలె నా త్రిమూర్తులు !



# గురుసాక్షాత్పరబ్రహ్మ

## శ్రీ శ్రీ శ్రీ లక్ష్మయ్యసారు



చిన్నప్పుడు సార్లెందరు
చెప్పి నారు చదువు మాకు
వారి పేర్లు కూడాచూడు
గురుతు లేవు నాకీ నాడు
అందరిలో భిన్నమైన
ఆచార్యుడు లక్ష్మయ్యసారు
నా అల్బం మొదటి పుటన
నయముగ నిల్పా నాయనను
వడ్డెపల్లి గడ్డ వాడు
దొడ్డ గురువు బిడ్డ తాను
ఐదారు తరగతులలో
ఆయన మాకు బోధించారు
చదువెంతో తాను మాకు
చనువు తోడ నేర్పించారు
మృదు మధురంగా చెప్పెడి
చదువదియే కాకుండా
నీతి సుధలు మాకెంతో
ప్రీతిగ బోధించు వారు
మానవత్వ సూక్తులెన్నొ
మమత మీర తెలుపు వారు
అందరిలో లేనట్టిది
ఆయన ఘనత ఆయనదే
విద్యార్థుల నందరినీ
వివరంగా పేరు పేర
పిలిచి విద్య నొసగు వారు
కలిసి మెలసి వుండు వారు

ప్రేమ మీర ఎదగాలని
తాము ఆశీర్వదించే వారు
నాకూ జగన్ సత్యంలకు
మా ముగ్గురికీ కూడాను
మసలినారు మాష్టరుగా
మహా మంచి టీచరుగా
నన్నూ రంగయ్య శ్రీరాంరెడ్డిని
మిన్నగ ప్రేమతో చూచు వారు
ముగ్గురినీ ఒకేరీతి
మురిపెంగా చూచు వారు
అంతే కాక అందరినీ
అదే రీతి చూచు వారు
చదువు పూర్తి ఐనాక నలభై
సంవత్సరాల తరువాత కూడ
మమ్ముల తాను మరువ కుండ
మా వద్దకి అపుడపుడూ
మక్కువతో మహనీయ
మానవతా మూర్తిగా తాను
మా యిళ్లకు వచ్చు వాడు
మమతానురాగాలు పంచు వాడు
మా అభివృద్ధిని గమనించు వాడు
మహదానందం పొందు వాడు !
ఆ పై ఆశీస్సులిడు వాడు
అంతటి అవ్యాజ ప్రేమ
సుంతైనా ఇతరులకు సాధ్యమా ?
గరుభక్తి వారి ఎడల

2

కురిపించాం మేము కూడా
కొండంత గురువునకు
గోరంత గౌరవాన్ని
గుండెలోన నింపుకొని
నిండు మనసుతో మేము
వారి కోర్కెలవసరాలు
భూరిగనే తీర్చినాము
అయినా ఆ గురు గురు ఋణం
ఏ విధిగా తీర్చగలం ?
ఆయన అనవరతం
అనుకుంటుంటారు మమ్మల్నే
పిలువ గానే ప్రేమ మీర
పిల్లలిద్దరి పెళ్లి కాయన
దూరభార మన కుండ
దొడ్డ మనసుతో వచ్చిరి
ఆశీర్వాదాలిచ్చిరి చాలా
ఆనందించిరి చాలా చాలా
ఇలాంటి వారే మరో గురువు లిద్దరు
ఇంటర్మీడియేటు – ఇంజనీరింగువారు
కెమిస్ట్రీ లెక్చరరు ఎమ్.ఎల్.ఎన్. రెడ్డిగారు
మెకానికల్ రీడరు ఎం. లక్ష్మణ్‌రావుగారు
విద్యార్థుల పాలిటి కల్ప తరువులు
నిజంగా చెప్పుకోదగ్గ గురువులు !



# అక్టోబరు నెల (పదోతేది)

అక్టోబరు నెలసాంతం
అచ్చిమాకు వచ్చినది
ఈ నెలలో పుట్టారేమో
నా తండ్రీ, తాతయ్యలు
ఈ నెలనే – నే పుట్టినట్లు
కార్యాలయాన చెల్లిపోయె
ఈ నెల యేడుననే అర్ధాంగిని
నే తొలిగా చూచితిని
ఈ నెల – నేనంతమందు
విరమించు చుంటి నుద్యోగం
ఆకునూరు వంశానికి
అదోవరం అక్టోబర్
అక్టోబరు నెలపది
ఆనందం మాకైనది
అర్వై ఐదులో ఈ రోజే
మా వంశోద్ధారి గౌతం
తొంభై ఐదులో ఈ రోజే
మరో వంశోద్ధారి అమోఘ
జన్మించి నారు మమ్మ
తన్మయులను చేసి నారు
గోపాల్ గౌతం అమోఘ

ముచ్చటైన మూడు తరాలు
పుట్టి నపుడు పరిస్థితులు
ముగ్గురి వవెంత తేడాలు
పై రెండు తరాల స్థితులు
అవి మరీ ఎంతో భిన్నాలు
ఒకరి కన్న ఇతరులు
అతిగ స్ఫురద్రూపులు
అతి విద్యా వంతులు
ఐశ్వర్య వంతులు
ఆదర్శమూర్తులు
వంశవృద్ధి పరిణామాల
సక్రమ మిదియే కాబోలు
ఇలాగే ఈ తరాలు
ఎదుగుతూ పోవాలి
ప్రతి ఒకరూ తమ కీర్తి
పతాకాలెగరెయ్యాలి
అంశలతో పాటుగ
వంశాభివృద్ధి కావాలి
ఈ ఆశయ సిద్ధికి దయతో
ఆ ఈశుడు తోడ్పడాలి !



# పుట్టినరోజు మనుమనికి ఆశీస్సులు

మనమడా మాస్టర్ అయ్యప్పా (సంధినామము)

నీ విద్యా బుద్ధులకు
నీ శ్రద్ధా వృద్ధులకు
నీ ఆశయ ఆశయాలకు
ఆకాశమె హద్దవాలి
నీ వారీ వృద్ధులకు
నీ వానందం కావాలి !

**బుజ్జి మనుమనికి**

పుట్టిన నాటి దీవెనలు
పొందుచు నున్న మా
బుద్ధి జీవి మనుమనికి
బుద్ధి మంతుడవడానికి
వృద్ధిలోన ఆకాశమె
హద్దు తనకు కావాలని
శుద్ధమైన ఆశీస్సులతో
వృద్ధులు తాతా నానమ్మలు
హద్దు లేని ఆనందంతో
ముద్దులతో మురిపెంతో !



# దిగివచ్చిన గంధర్వుడు

ఎన్నో సంవత్సరాల నా
చిన్న కోరిక తీర్చాడు
మా పెద్ద మామయ్య
మరల తానవతరించాడు
మహనీయ ధ్రువ తారగ
మా మధ్యకు వచ్చాడు
గంధర్వుని రూపంలో
గగనం దిగివచ్చాడు
సర్వేశ్వరుని లీల
కాదా మరి ఈ హేల
కోరినదే తడవుగా
కోరిక నాది తీరెనుగా
ఎంతబుద్ధి జీవి మ
రెంత మానవతా వాది
నన్ను 'కవిగారూ' అని పిలచి
అది నిజమవ చూడదలచి
ఆపై నన్నాశీర్వదించి
తన విశ్వరూపం చూపించి
ఆనంద సాగరాల
ఓలలాడించ మమ్ముల
వేంచేశాను వేంకటేశుడు
వినువీధినుండి ఈశుడు !

10-10-95

-- ❁ --

# నామొర వినవా – ఈశ్వరా

నాకు పరీక్షయేలయిది ? నమ్మితినిన్నె కదామదిన్ సదా
నీకు నమస్కరించెదను నిక్కముగా ననునమ్ము మీశ్వరా
నా కవితాది పుస్తకము నన్విడి పోయెనదేటికోకదా
నాకది తిర్గివచ్చునటు నాశిసులివ్వగ కోరుదీశ్వరా !

ఎక్కడ పారవైచితినొ ? ఎవ్వరి చేతులయందునిల్చెనో ?
గ్రక్కున తెల్పుమయ్య ! ననుగావు మటయ్య ! మదీయ దుఃఖమున్
ఒక్కడ తీర్చవయ్య ! మదినోడిన వానిని నీవు యీ విధిన్
చిక్కుల పాలుచేయుటది చిత్ర విచిత్రముకాదె ఈశ్వరా !

జీవిత మంత నమ్మితిని జేజగ నిన్ను మదిన్ ముదాన న
న్నీవిధి బాధ పెట్ట తగునే పరమేశ్వర భోలనాథ నా
జీవిత మెల్ల బాధలుగ జేసితి వేమిటికయ్య నా కిలన్
నీ వెకదయ్య దిక్కు నిక నెవ్వని యొద్దకు నేను పోగలన్ ?

ఈ బాధామయ జీవితమ్మున ఇలాగింకెంత కాలమ్మునే
నీ బాధల్బరియింపగా గలను నిన్నే నమ్మితి న్గాదె నా
కీ బాధల్తొలిగింప జేయు మది కాదేని శ్రీఘ్రంబుగా
రా బాధల్తొలగించుమయ్యదయ నా ప్రాణమ్మునే తీసుకో !

ఉన్నదె ఒక్క సంతసము ఊడిన దయ్యది ఇంక నాకు యే
మున్నది నన్ను యీ విధిని మోసము చేసెను జీవితమ్ము నా
కెన్నడు యివ్వదే సుఖము యేమని యేడ్తును యెట్లు మళ్ళి నే
నున్నవి వున్న యట్టులుగ పూర్తిగ వ్రాయగ గల్గుదున్ విధీ
నన్నిక బ్రోచి చూడ గదె నాకది శీఘ్రము రాగ జూడవే !



# పదవీ విరమణ భాషణ - కవితాఘోషణ

ప్రియమైన మిత్రులార
దయతోడ మీరునాపై
కురిపించిన ప్రేమజల్లు - నేనెపుడూ
మరువలేని హరివిల్లు
ముప్పైఐదున్నర వత్సరాలై
ముగుస్తున్న ప్రజాసేవ
''కాంతి శక్తి'' వాడుకదార్లకు
కాలంలా ఖచ్చితముగ
ఘనముగా గర్వంగా
వెనకముందు లేకుండా
నిండు మనసుతో సేవలు
దండిగ అందించినాను
అందుకు నాకెంతో
ఆనందంగా వున్నది
నా దరికే తెంచిన
సోదర వాడుకదారెరూ
నిరాశ చెందలేదు
నిస్పృహ పాలవలేదు
నా పరిధిలో సాధ్యమైన
ఏ పనినైనా శ్రీఘ్రంగా
చేసి నేను పంపించాను
వారెంతో సంతసించ
మరెంతో తృప్తిచెంద
చూసి మురిసి పోయాను
నేను చేసిన సేవ లేవి
నిజంగా వృధా పోలేదు

ప్రజల మెప్పుల రూపంలో పది
కాలాలవి నా హృదిలో
పరుగెత్తి నేను చేసిన
పనులెన్నో ప్రశంసలు పొంద
గరువంతో నా శిరస్సు
గగనాన్నే కాంచినది
ఒక్కొక్క సందర్భాన్ని
ఇక్కడ నేను ఉటంకిస్తే
నా భాషణ ముగియ కుండ
నవంబరు ఒకటి ప్రవేశించు
అన్నిటినీ పదిల పరిచి
అవి యొక పుస్తక రూపంలో
ప్రచురించాలను కొర్కెనాకు
ప్రబలంగా ఉన్నందున
ఆపై నెలాగు మీరందరు
అవి అన్నీ చదవు కొంటె
నా పిచ్చి రాతల గాంచి
నవ్వుకొని పోతారో
నా నుదిటి బ్రహ్మరాతకు
నన్నభినందిస్తారో
వేచి మనము చూడాలి
చూచి నేను తరించాలి
ఒకే సంవత్సర మందున
ఒక డిస్ట్రిక్టు అవార్డు
అందుకొనడమే కాక
అదే అదే వత్సర మందు

2

రెండు వివిధ డిపార్ట్‌మెంట్లు
వేర్వేరుగ నాపేరును
తెలుగు విశిష్ట సేవాపతకము
గ్రహించగా ప్రతిపాదించెను
ఆ రెంట బోర్డాకటను కుంటే
పొరబడి పోతారు మీరు
ఆరుద్యోగ పత్రాలు చేతనుండ
అవి అన్నీకాదని నేను
బోర్డు లోన చేరడమే
పొరపాటు నాదైనది
ఆ యేడే మారి ప్రభుత్వం
ఆ అవార్డుల పూడ్చి పెట్టె
అది నా కాశ్చర్యం కల్గించలేదు
అది విని నేను నీరు కారి పోలేదు
అవార్డుకర్హత సంపాదిస్తే
అది పొందినంత గొప్పేకద ?
రాలేదని బాధపడితే
అది మరింత తప్పే కద ?
వచ్చినా ఏమది చూచితే
మరీ చిన్న కప్పే కద ?
అందుకోవడంకన్నా
అర్హతయే కదా మిన్న
నావృత్తి గమన మందు
నల్గురితో మెప్పు నేను
పొందినాను గాని ఎపుడు
నిందలవి నిలువలేదు
పై వారు చాలామంది
చిందినా ఈర్ష్యా ద్వేషాలు
క్రింది వారు మాత్రము
పంచినారు ప్రేమామృతం
ఈ రీతిగ నా సేవలు
ఐన వెంతో ఉన్నతాలు
నాకు సంతస కారణాలు
ఘన గర్వ తోరణాలు
పదవీ విరమణ సందర్భం
సింహావలోకన సమయం
ఆత్మ పరిశీలన అవసరం
గర్వంగా మన మన ఘన
కార్యాలను నెమరువేసి
ఏమి మనము సాధించామని
వెనుదిరిగి చూసుకోవాలి
అకార్యాలు చేసినచో
అవనత శిరస్కులవ్వాలి
ఘన కార్యాలకు గర్వపడాలి
మనసారా సంతసించాలి
కాంతిశక్తి సేవలు ముగించి
క్రాంతిశక్తి సేవలందించాలని
ఈ మధ్యే కవితలు
వ్రాయ మొదలు పెట్టినాను
ఆరునెలల నుండి నేను
ఆర్భాటముగ వ్రాసినాను
సాహిత్య సేవ రూపంలో
నా ప్రజలకు నా జాతికి
అందించాలన్నదే నా ధ్యేయం
జాతిని చైతన్యం చేయాలన్నదే
నా సత్సంకల్పం, ధృఢనిశ్చయం
మరొక్క సారి చివరగ
పరమ మిత్రులందరికీ
నతశిరస్కుడనై నేను
కృతజ్ఞతలు తెల్పుకొందు !
జై కాంతి శక్తి !

31-10-95



# మన్నించవా

నేను రిటైరై పోవడం

నీవింకా పనిచేస్తుండడం

నన్ను బాధిస్తున్నవిషయం

మిన్నగా యిది మహాదారుణం

నీ కన్నిటా సహాయం చేయడం

కాదు నాకసలేమీ కష్టం

కాస్త నవ్విస్తూంటే

ఇంటా వంట నావెను వెంటే

తోడుగా నీ వున్నావంటె

నేను సహాయంచేస్తుంటే

ప్రొద్దు మాపూ జోరుగా

ఎంతో ఎంతో హుషారుగా

మరెంతో తీయ తీయగా

మనం ఉండొచ్చు హాయి హాయిగా

కొంత కష్టం నీది తగ్గించడం

ఎంతో నాకు ముదావహం !

31-10-95

# ముప్ఫైమూడోవసంతప్రయాణంలోనికి

కాలచక్రగమనంలో
కలిసిప్రయాణించినాము
ముప్పది రెండేండ్లుగా
ముద్దాముచ్చటగా
మురిపెంగా మోహంగా
మనయిద్దరు పిల్లలూ
మన ముద్దుల బిడ్డలూ
ఘనంగా ఎదిగినారు
మనలనే మించినారు
దైనందిన జీవితాలలో
ఆనందోత్సాహాలతో
వారివారి తోడులతో
కూరిమిగా కలిసి మెలసి
అడుగు ముందుకేస్తున్నారు
అపురూపంగా మనలను
ఆనందంలో తేలుస్తున్నారు
ఆదర్శంతామౌతున్నారు
ముసలి వారి మింకపైన
మోజుగ మనం బ్రదకాలి
మనమన కోరికలను
ఘనముగ తీర్చుకోవాలి
మళ్లీ యింత కాలం మనం
హాల్లీయే కదా బ్రదకడం
మన పిల్లల సహకారం
మనకెంతో వున్నది
వారికి మన పెద్దదిక్కు
వారికది జన్మహక్కు
ఆదర్శ కుటుంబంగా
అందరం మసలుదాం
ఆ పైన మహదానందంగా
అందరం బ్రదుకుదాం
అందరికీ కన్నుకుట్టు
అయేలాగ జీవిద్దాం
ఆ దిశలో యికపైన
అడుగులేసి నడుద్దాం
పాదునీకు నేనైతే
జాదువీవునాకులతే
ప్రోది నీకునే నైతే
ప్రోయాలివి స్వర్ణలతే
ఒకరి కొకరమై మనం
సుఖమూ సంతోషాలతో
ఇక మీదటనూ యిద్దరం
ఒకటిగాను జీవిద్దాం
ఈవివాహ వార్షిక దినం
కావాలిద్దరికీ ఆనందమయం
ఆకునూరు స్వర్ణలతా
అందుకొనవె తనూలతా
వివాహ వార్షికం నాడు
కవి వృద్ధుని ఈ గోడు
ఎంత సుదినం ఈనాడు
సుంత యోచించి చూడు
నాటి నీ అర్ధమైమూడు
నాటి గోపాలకృష్ణుడు !



-- ❖ --

21-11-95

## వివాహమహోత్సవాన ఆశీస్సెసలుగా
## డాక్టర్ విద్యానందుకు  అక్షరాక్షితలు

దంతవైద్య విద్యానందు
ఎంతో అదృష్టము నీదందు
విజయను వరించినావు
సజావుగా పెళ్లాడినావు
విజయాన్ని నీ ప్రక్కనే
నిజముగ నిల్పుకొన్నావు
ఆమెనీకు నీడగానుండు
నీ వామెకు జోడుగా నుండు
మీదంపతులిద్దరు
ఆదిదంపతులరీతి
అలరాలాలనినే
నాకాంక్షిస్తున్నాను
నీ దంతవైద్యమికపై
మూడునోళ్ళుగా
ముప్పది ఆరుపళ్ళుగా
అభివృద్ధిచెందాలని
ఆశీర్వదించమని
ఆదేవుని కోరుతున్నా
అలాగే నేనుకూడ
మీ క్రొత్త దంపతులను
మెండుగ సంతసాలగ్రోల
మిక్కిలిగా ఆశీర్వదిస్తున్నా !



# స్థిత ప్రజ్ఞత

దుఃఖమసలే లేని జీవి
దొరుకునా ఎచటనైన
దుఃఖసుఖాలనునవి
దొరుకుతాయి అందరికీ
చీకటి వెలుగులలాంటివి
సుఖదుఃఖాలు కూడ
చిత్రముగా వస్తుంటవి
చెల్లగానె పోతుంటవి
వెలుగునందు సుఖాలందు
కలుగు మంచి అనుభూతి
చీకటి దుఃఖాలలోన
చెదిరి పోవు మనస్సులు
చీకటినీ వెలుగునూ
సుఖమునూ దుఃఖాన్నీ
ఒకటిలాగస్వీకరించి
అన్ని వేళ లందు కూడ
ఉబ్బక తబ్బిబ్బు కాక
ఉరికి బోర్లపడ కుండ
అదరకుండ బెదర కుండ
అడుగులు తడబడ కుండ
ఆత్మబలం వీడ కుండ
అతి చక్కగ నిదానంగ
స్వప్న క్లిష్టలలా
చాక చక్యంగా
అన్ని పనులు చేయువారు
అవుతారు స్థిత ప్రజ్ఞులు
అట్టివారె జీవితాన్ని
అనుభవింతు రతి చక్కగ !



# మాట్లాడాలని

అపుడే మాట్లాడాలని
అంత తొందరెందుకురా !
ఈ పిచ్చి తాతయ్యపై
ఇంతప్రేమ ఎందుకురా !
మనసువిప్పి మాట్లాడగ
నేను చూడ లేదెవరిని
ఒంటరియీముదుసలికి
జంటగ నిన్నిచ్చెనా !
నీవు చూడ బోతె రెండు
నెలలకే తాతతో
మాట్లాడాలను నట్లు
మారాం చేస్తున్నావు !
ఎగిరెగిరి కేరింతలు
ఎక్కిళ్లు పట్టు నందాక
ఎందుకురా కొడతావు !
నీకెక్కిళ్లు పట్టితే
నేను చూడ లేనురా !
నీ బాధల నన్నిటినీ
నాకు బదిలీ చేయరా !
నీ వెప్పుడు సుఖ శాంతులు
నిండు కొనీ వుండరా
నింగే యిక నీ హద్దుగ
నీవు ఎదిగి చూపరా !
మురిసి మురిసి ఈ తాతయ్య
ముక్తి పొందు తాడురా !!



# తాత జోల

ఇది నిన్ను లాలించు లాలిరా
ఈ తాత తెచ్చిన తల్పంరా
తాత ఊపిరివి నీవేరా
తాత గుండెయే నీ తలగడరా
తాత కవితలే నీకు ధనంరా
తాత ఆశీస్సే నీకు రక్షరా
ఇదిగో రంగుల బొమ్మరా
నిన్నాడించు రాట్నమురా
అమ్మ పనులలో వుంటేరా
అపుడు నీకిదే అమ్మరా
తను గిరగిరా తిరుగునురా
నిను మోదంలో ముంచునురా
అమ్మలాగే ఆప్యాయతగరా
అలరించు నిన్ను నిజంగారా
దీన్ని చూస్తూ ఆడు కోరా
అలసి పోతే నిదుర పోరా
అమోఘాశ్రితుడవే నీవురా
అందముగా నీవెదగరా
అమోఘంగా చదువుకోరా
ఆశ్రిత వత్సలు డవ్వరా
శ్రీరాముడు శ్రీకృష్ణులలా
ధర్మరాజు కర్ణులలా
నీకు పెట్టిన పేరుకురా
వన్నె నీవు తేవాలిరా
ప్రథమాశ్రితుడీ తాత యేరా
నీవాత్సల్యం కురిపించరా
నాకందరి కన్నా ముందేరా
నీ వాత్సల్యాభిషేకం చేయించరా
నిన్ను చూసి మురిసి పోతురా
నీయీ తాత బ్రతకాలిరా
నీ కీర్తులాకాశాన్నంటాలిరా
నీ తాత చూసి తరించాలిరా
నే కోరినట్లు జన్మించావురా
నీవు నా పెద్ద మామవురా
గొప్ప బుద్ధి జీవివిరా
కవిగారూ అని అంటివిరా
కవితలు చూడ వస్తివిరా
కవిగారిని సతతం కాచుకోరా
కవిత్వాలు వర్ధిల్ల చూచుకోరా
నాన్న – అమ్మ కోరిక లన్నీరా
నమ్రంగా నీవు తీర్చాలిరా
అన్ని వేళలా అన్నిటిలోరా
ఆకాశమె నీ హద్దవాలిరా
బామ్మగారి విద్యా ధనానికిరా
తాతగారి బుద్ధి ధనానికిరా
నీవు వారసుడు కావాలిరా
నీపేరీ జగమున మ్రోగాలిరా !



# ఆరనిమంటలు

హింసావ్యాకులమూగాయాలు
ప్రతిదినపూ అనుభవాలు
నాగుటించి చేశావా ఆలోచన
దేవుడా ఎపుడైనా ఏనాడైన

గుండెమండుతూనేకద
ఉండెనహో దశాబ్దాలు
దేనితోని చేసినాడో
దీన్ని ఆబ్రహ్మదేవుడు
కణకణమంటల్లోనూ
కాలిబూడిదవదేమిది ?

ఎద కోరిందేమిటది
బ్రతు కిచ్చిందేమిటిది
ఇదియూ ఓ బ్రదుకా
బ్రదికి చచ్చినటులుగా

బ్రతుకు సుఖము లనుభవింప
మళ్లి పుట్టి తీరాల్సిందేనా
అపుడు దొరుకు సుఖమని
ఆశ మాత్రమే కదా మరి !



# శోకసంగీతం



'ఋణాను బంధరూపేణా
పశుపత్ని సుతాలయః'
అన్నా రెంతో అనుభవంతో
విన్నావుకదా ఓ సత్యం
సంగీత మనందరి ఋణం
సజావుగా తీర్చుకొని
అందరినీ దుఃఖంలో ముంచి
సుందర స్వర్గము చేరెను
దేవుడు ప్రేమించినవార్నే
చావు త్వరగ వరిస్తుందట
సంగీత అవసరం స్వర్గంలో
చాలానే వుండుంటుంది
పాపీ చిరాయు వన్నట్లుగ
మనం బ్రదుకుతున్నామేమో
తను పుణ్యాత్ము రాలేమొ
తనువు చాలించింది త్వరగా
మన కంటే మిక్కిలిగా
ఘన మైన ప్రేమ తోటి
సంగీతను సర్వాంతర్యామి
చక్కగనే చూడ గలడు
మన మంతా దాన్నెప్పుడు
మనసారా ప్రేమించాం
మనశ్శాంతి వుండేట్టే
ఘనంగానె పెంచాము



-- ❁ --

20-3-96

# బ్రహ్మపైత్యం

సుఖం గీత
నా ముఖాన
సుతరాము
వ్రాయ లేదు!
అందుకనే
నే నెపుడు
ఎట్టి సుఖం
పొంద లేదు!
బ్రతు కంతా
కష్టాలే!
బహు వ్రీహి
సమాసాలే !
ఈ ఎడారి
బ్రతుకు లో
సుఖ మెప్పుడూ
ఎండ మావె !
చూడ లేదు
ఒయాసిస్సు !
సుఖంగీత
వ్రాయు తరిని
బ్రహ్మ భార్య
పిలిచె నేమొ ?
వాడి పాళి
విరిగె నేమొ ?





# అల్లుని తల్లి వెళ్లి పోయినది

ముళ్లపూడి వారియింటి
మురిపాల కూతురివి
కనకదుర్గ తల్లివీవు
కపిలేశ్వరపురమందు
కనులు తెరిచి పెరిగి పెరిగి,
కన్యగ శంకర వారిల్లు మెట్టి
వేంకటేశ్వరరావుగారి
వెంట నర్వైయేళ్లు నడిచి
ముద్దుగ ముగ్గురు కూతుళ్లను
ఇద్దరు యింపగు కుమాళ్ళను
పెద్ద వాళ్లనుగ జేసి నీ
ముద్దు ముచ్చటలు దీర్చి
మనుమల మనుమరాళ్ల
వారివారి పిల్లలకూ
ప్రేమమీర చేసితివీ
ప్రేమ తోడ పెంచితివీ
ఏ పెద్ద బడి కెళ్లకయు
నీ వద్ద విజ్ఞాన మది
ఓ గనిలా మరి ఓ
తరగని జలలా
ఎలా నిక్షిప్తమైనదో
మువ్వురు కూతుళ్లను
నువ్వు ఒకే రీతిగ
తెలుగు సాహిత్యాన నీవు
కలిగియున్న పాండిత్యంతో
తెలుగు యమ్మే లగుటకు
వెలుగుదారి చూపితివి !
ఇల్లే ఓ వైకుంఠంలా
ఇన్ని నాళ్లు చేసి చాకిరీ
ఒళ్లంతా అరుగ దీసి నీ
వాళ్లకు మాకు సుఖం పంచి
అందరూ నిన్నో దేవతగా
అనుకునే రీతి మసలి
దేవలోక మేగితివా
దీనులు గా మమ్ము వదిలి
అల్లునినో అమ్మలాగ
ఎల్లకాలం చూసిన
తల్లివి నీ ఋణం నేను
ఎల్లా తీర్చగల నమ్మా !
నీ కృప నా ''అమ్మకృప''
నీవే మా కెల్ల కృప
ఎల్లప్పుడు దాన్ని మాకు
చల్లుము తల్లీ పైనుండి
నిన్నటి నుండి మేమంతా
కన్నీరు మున్నీరైనాము
ఎంత ఏడ్చినా కన్నీళ్లు
ఇంకా ఇంకా వస్తున్నవి
ఎంత చెప్పినా నా హృదయం
ఇంకా ఇంకా రోదిస్తున్నది
ఇదే మా అశ్రు తర్పణం
తో చేసే నీ పాద పూజనం !



-- ❋ --

25/26-03-96

# చిరంజీవి ఆకునూరు అమోఘ

ప్రథమ జన్మ దిన ఆశీస్సులు

బుజ్జి మనుమనికి

. . . . .

జీవించరా వేల వత్సరాలు
దీవించు నీ తాత అక్షరాలు
నీతి – నెనరూ – న్యాయం ఊపిరిగా
జాతి రత్నమై నీవు వర్ధిల్లు !

వేన వేల వత్సరాలు
అమోఘ నీవు జీవించాలి
వేన వేల ఈ దినాలు
తిరిగి తిరిగి రావాలి !

నీవు చదివి గొప్ప చదువులు
ఎంతో పైకి రావాలి
నీవు చేయు మంచిపనులు
చిన్న పెద్ద మెచ్చాలి !

నా ఆశయ ఆదర్శాలు
నా అన్ని లక్ష్యాలు
నీవు నెర వేర్చాలి
నేను సంతసించాలి !

10-10-96

-- ❁ --

# వివాహమహోత్సవ సందర్భాన

అక్షరాక్షితలు

నల్లగొండ రవికి

. . . . .

నల్లగొండ రవి మా
కెల్లరకీ తను ఆప్తుడు
మా బాబు గౌతంకు
మహామంచి స్నేహితుడు
ఫోటోగ్రఫీ విద్యలోన
నిపుణుడు రవి తాను
మా రూపాలెన్నో సార్లు
మహితముగా చిత్రించెను

'శ్రీవీణ' ను ఎన్నుకొనెను
సిరిని ప్రక్క నిలుపుకొనెను
తన గుండె వీణియను
ఘనముగ మీటించు కొనును
ఆది దంపతుల రీతిగ
అర్థ నారీశ్వరులలలా
ఆదరించుతూ పెద్దల
వర్ధిల్లండన్ని వేళల

మీదాంపత్య జీవితం
మిక్కిలిగా సుఖశాంతుల
మీకివ్వాలని సతతం
మేమంతా కోరుతున్నాం !



# ఏమి భీభత్సమో - ఎవడిదీ శాపమో ?

అక్టోబరు - నవంబరులలో ఆంధ్రాను
అతలాకుతలం చేసిన పెనుతుఫాను
చేకూర్చిన నష్టానికి చింతిలుతూ నేను
చెప్పలేని దుఃఖంతో వ్రాసుకున్నాను
పచ్చని మన ఆంధ్ర రాష్ట్రాన
పదే పదే ఎందుకీ ఆవేదన
ప్రాణాలు ఆస్తుల ధ్వంసం చేయు
పెను తుఫాను పిచ్చిగర్జన !
ఇంత త్వరిత చిచ్చులను
యేనాడూ యెరుగము
ఇంతగ జన నష్టమును
ఇంతకు ముందు కనము !
ఏల ప్రకృతి కీ కోపము
ఇంతటి ఈ భీభత్సము
ఇంత నిర్దయ గుండెతో
ఎవడు పెట్టిన శాపము !
దశాబ్దాల ప్రజల కాయకష్టం
కలలు కన్న వారి భవ్య భవిష్యం
చూస్తుండగానే క్షణాల్లో
తుడిచివేసే తుఫాను దెయ్యం
కన్నీరు మున్నీరగు కష్టాలే
కోన సీమ ప్రజలనుభవిస్తున్నారులే
యెంతని ఆర్తి తీర్చగలదు ప్రభుత్వం
ఎక్కడ చూచినా తేలుతున్న శవాలే
ఇది రాష్ట్రానికి పట్టిన దురదృష్టం
రాష్ట్రీయ సాయానికి తలకు మించిన నష్టం
అంతా కలసి పంచుకున్నా కాని
ఏనాటికి కోలు కోవాలి రాష్ట్రం !

8-11-96 -- ❁ --

# పునఃపునరపి

నాగార్జున సాగరము
నా భగవద్గీత నిజము
మీ మహా నాయకుడు
మహా శిల్పి పద్మ దేవుడు
నా కయె ననవరతము
తను తానే ఆదర్శము
అంతయే కళా శీలిగా
అనంత విశ్వాత్మజునిగా
అడుగడున మసలినాను
ఈ విధాన కూడా మీరు
'అయ్య' తాము ఐనారు
నలభై యేళ్లపై బడిన
నా అభిమాన మెంతనిన
నన్ను మిమ్ముల మరోసారి
నా యీ కవితల ఝురి
'మౌన రణం' లో పుట్టి
నన్నో కవిగా నిలబెట్టి
మీ బుడతడి నయే వరం
మిగిల్చె నెంత సంతసం
ఒక గొప్ప కవి ప్రభావం
ఊహ కంద నంత దూరం
ఉరికి పోవుటే కాక
ఉద్ధరించు సమాజం !

శ్రీ సినారె గారి కొరకు పూచిన పూజా కుసుమం





16-11-96

## ఆకునూరు వంశవృక్షము

(సంబంధికుల వివరాలతో)

కీ॥ శే॥ ఆకునూరు అప్పారావుగారు
,, ,, వెంకటనర్సమ్మగారు

శ్రీలక్ష్మి నర్సింహారావుగారు
శ్రీమతి రాధాదేవి గారు (A)

- గోపాలకిషన్‌రావు (కవిగారు) 'విద్యారత్న' డాక్టర్ స్వర్ణలత (B)
  - డాక్టర్ స్వప్న (C)
  - డా॥ గౌతం శైలాకుమారి (D)
    - అమోఘ
- ఆశాశ్రీ (E)
- జగన్మోహన్ రావు ఇందిర
  - జితన్
  - రతన్
  - శేషఫణి
  - శేషమణి
  - -కవలలు-
- సత్యనారాయణ సరళ
  - కవిత
  - సంతోష్
- సీత (F)
- అరుంధతి (G)
- ప్రభాత్ కుమార్
- భారతి (H)
- విద్యాదేవి (I)

# సంబంధీకులు

**(A)**

కీ॥ శే॥ దేవులపల్లి కేశవరంగారావు గారు
" " ఆండాళమ్మగారు

కీ॥ శే॥ వేంకటేశ్వరరావుగారు
(నా పెద మేనమామ)
కీ॥ శే॥ కరుణ (రుక్మిణి)

కీ॥ శే॥ కోదండ రాములు
శ్రీమతి లక్ష్మి



రాకేశ్
రుక్మిణి
హరీష్

రాధాదేవి (A)

సుదర్శన్‌రావు గారు
(నా చిన మేనమామ)
సరోజిని

ఏడుగురు కుమారులు
ఇద్దరు కుమార్తెలు

**(B)**

శంకర వేంకటేశ్వరరావు గారు
కీ॥ శే॥ కనకదుర్గమ్మగారు

స్వర్ణలత (B)
భవాని

రామోహన్‌రావు
స్వర్ణరేఖ

రవి
వందన
రమ్య

కిరణ్
మీనా

రాధా క్రిష్ణరావు
సత్యవతి

రాజరాజెశ్వరి
శ్రవణ
ప్రవీణ్

**(C)**

కీ॥ శే॥ వేమూరి రాంగోపాల్‌గారు
శ్రీమతి విశాలాక్షి గారు

శారద
రామం

ఆనంద్ బాబు

క్రిష్ణ గారు
డా॥ స్వప్న (C)

కల్యాణి

# సంబంధీకులు



(D)
కీ॥ శే॥ చిన్నమల నాగమయ్య గారు
శ్రీమతి శారద గారు
లింగమూర్తి
మంగళ
ప్రియాంక
ప్రత్యూష
అశోక్
శాంతి
స్వాతి
నవీన్
శైలాకుమారి
(D)
ఇతర
సహోదరులు
(E)
కీ॥ శే॥ పాలకుర్తి వేంకట రంగారావు గారు
శ్రీమతి వెంకటమ్మ గారు
కీ॥ శే॥ సీతారాంరావు గారు
శ్రీమతి ఆశాశ్రీ (E)
రంగారావు
లక్ష్మి
పవన్
వెంకన్న
(సంధి నామము)
మాధవి
కొత్తపేట రామక్రిష్ణరావు
శ్రీనికేతన్
సంతోష్
మాధవి
మాటేటి రమేష్
(F)
కీ॥ శే॥ కట్టెకోల రామారావుగారు
శ్రీమతి యాదగిరమ్మ గారు
నారాయణరావు
సీత (F)
పద్మ
కిషన్‌రావు
(G)
కీ॥ శే॥ తుంగతుర్తి రంగారావు గారు
శ్రీమతి ఆండాళమ్మగారు
వేంకటేశ్వరరావు
అరుంధతి (G)
అభిలాష
వ్యాస్ (వంశీ)
నిర్మల
ప్రభావతి
(H)
కీ॥ శే॥ దేవులపల్లి వేంకట తిరుమలరావు గారు
శ్రీమతి సుమిత్రా దేవి గారు
జయంత్ కుమార్
వరలక్ష్మి
శరత్
దీప
లక్ష్మి నరసింహారావు
రమాదేవి
శ్రీరేష్
స్రవంతి
రవళి
హరీశ్ బాబు
భారతి (H)
(I)
శ్రీ సింగరాజు క్రిష్ణారావు గారు
శ్రీమతి విజయలక్ష్మిగారు
సదానంద్
విద్యాదేవి (I)
శృతి
వరలక్ష్మి
శారద
రమ
ఉమ
(కవలలు)

## త్వరలో విడుదల కానున్న 'కవిగారి' ఇతర రచనలు

| | | |
|---|---|---|
| 1. | కవిగారి స్వగతాలు | నాతో నలభైయేళ్లు సన్నిహితంగా మెలిగిన నా వాళ్లపై కవితలు (80 వరకు) |
| 2. | Yours Lovingly - I | శ్రీ శర్మాజీ గారి తెలుగు ప్రేమ కవితల 'నన్ను నీకిచ్చేశాను' సంపుటి ఆంగ్లానువాదం. |
| 3. | Yours Lovingly - II | --- do -- |
| 4. | Brainy Brights - I | ఆచార్య సినారె గారితో మొదలిడి ఇతర కవుల తెలుగు కవితల ఆంగ్లాను వాదాలు |
| 5. | Brainy Brights - II | --- do -- |
| 6. | ఉర్దూ కవితలు | స్వీయ రచనలు మరియు ఇంగ్లీషు. తెలుగు నుండి అనువాదాలు. |
| 7. | తుషార తోరణం | తెలుగు కవితలు – స్వీయరచనలు. |
| 8. | తురుష్క తుషారము | గాలిబు మరియు యితర ఉర్దూ కవుల గజల్, రుబాయీల అనువాదాలు (తెలుగులో) |
| 9. | మనసు – మగువ – మదిర తుషారము | స్వీయ కవితలు |
| 10. | సూక్తి సుధాతుషారము | --- do -- |
| 11. | మనోజ మనోజ్ఞములు - I | --- do -- |
| 12. | మనోజ మనోజ్ఞములు - II | --- do -- |
| 13. | మనోజ్ఞ తుషారము | అనేకానేక రచయితల / ఆంగ్ల ప్రవచనాలకు తెలుగు కవితా రూపం |
| 14. | మనోగతము | ప్రసిద్ధ ఉర్దూ, హిందీ పాటల తెలుగు అను వాదగేయాలు |
| 15. | మహితోక్తి తుషారము | ఇతర భాషా కవుల రచయితల మహత్త్వ పూరిత బావతరంగాలు తెలుగు కవితా సంపుటి. |
| 16. | మనోజ్ఞములు | 1995 సంవత్సరంలో వచ్చిన అన్ని సంర్భములపై కవితలు (జాతీయ దినములు పండుగలు వగైరా) |
| 17. | స్వర్ణగోపాల శతకము | 108 మానవతా విలువల తెలిపిన శతకము |
| 18. | జీవితంతో పోరాటం | ఆత్మకథ (తెలుగు) |
| 19. | లైఫ్–ఎ స్ట్రగుల్ | ఆత్మకథ (ఆంగ్లం) |
| 20. | హాస్య తుషారం | పకపకల ప్రహసనం |
| 21. | గీతా మకరందము | భగవద్గీతలోని ప్రసిద్ధ శ్లోకములకు తెలుగు వెలుగులు |
| 22. | కదంబ తుషారము | పై వాటిలో నిమడని అన్ని యితర కవితలు ! |



★ ★ ★ ★ ★

# ప్రార్థన

ఇది చదివిన వారెల్లరు
తమ అభిప్రాయాల తీరు
శ్రమ యనుకోకుండా దయతో
తప్పక నాకు పంపించగలరు !

మీ విమర్శ నా కవితా పరిణతకు
ఎంతో ఎంతో తోడ్పడు ననుటకు
నాకు లేదే విధమైన అనుమానము
మీరంతా పాఠక దేవుళ్ళైనందుకు !!

-- ❈ --